# శృంగార
# రాధామాధవ సంవాదము



వెలిదిండ్ల

వేంకటపతి మహాకవి

విరచితము

ప్రకాశకులు

జీ. యస్. [illegible] అండు కో



సర్వస్వామ్యసంకలితము

ప్రథమముద్రణము

లండన్ రాయల్ యెడిషన్

వెల రు. 2-0-0

చెన్నపురి:

ఆంధ్రపత్రికా ముద్రాలయమ్మున

ముద్రితము—1926.

# పీఠిక

దక్షిణదేశమున వెలసిన తెలుఁగుకృతులు జుంటితేనె పెరలవంటివి. భాషయు, భావములును దేటతేటలై, తీయ తీయనై యుండును. విజయవిలాసము, తారాశశాంకవిజయము, ఈ రాధామాధవసంవాదము, అహల్యా సంక్రందన విలాసము, సత్యభామాసాంత్వనము, రాధికాసాంత్వనము, మొదలగు దక్షిణాంధ్ర కృతులముందు తత్కాలమున వెలసిన యుత్తరాంధ్రకృతులు కూచిమంచీయాదులు, దివిటీలముందు దీపములున్నట్లున్నవనుట సత్యేతరముగాదు. ఇట్టి ప్రశంసకుఁ దగు దక్షిణాంధ్రకృతులలోని యీ రాధామాధవమునకు

## కృతికర్త

వెలిదిండ్ల వెంకటపతికవిసార్వభౌముఁడు. మాకు దొరకిన మాతృకలలో నీకృతి కృత్యవతరణిక లేదయ్యెను. కావున గ్రంథకర్త స్వవిషయమునం దేమి చెప్పికొనెనో యెఱుఁగరాదు. * ఈ వెంకటపతిసార్వభౌముని కుమారుఁడగు అయ్యన్నశాస్త్రి రచియించిన వ్యాసతాత్పర్యనిర్ణయమునుబట్టి యీతని విష

---

* తంజావూరి పుస్తకశాలలో రాధామాధవ సంవాదము కలదని తెలియవచ్చుచున్నది. అందుఁ బీఠికగలదేమో! ఉండెనేని దాని నింకొకముద్రణమునకు సేకరింతుము.

యము కొంచె మెఱుఁగనగుచున్నది. వ్యాసతాత్పర్య నిర్ణయ
మున నిట్లు గలదు:

శ్లో. శ్రీవేంకటపతే స్సూను రళఘురే రనుజః కవేః,
అయ్యన్నో వైణికః కుర్వే వ్యాసతాత్పర్య నిర్ణయమ్.

గద్యమ్.—ఇతి శ్రీమద్రాధామాధవసంవాదాద్యనేక
ప్రబంధనిర్మాణధురీణస్య, శ్రీవేంకటపతి కవిసార్వభౌమస్య
తనూభవేన, సుదన్తాకల్యాణాద్యనేక ప్రబంధరచనాచాతురీధౌరే
యస్య, అళఘురికవే రనుజేన, వీణావాదనప్రవణేన, వేదాంత
సిద్ధాంతరహస్యార్థప్రకాశనధురంధరేణ, శ్రీమదయ్యన్నవిద్వన్మ
ణినా విరచితే వ్యాసతాత్పర్య నిర్ణయే."

ఈ యయ్యన్నశాస్త్రి తనతండ్రి రాధామాధవ సంవాద
మును బ్రశంసించినాఁడు. ఈతని సోదరుఁడు అళఘురి సుదంతా
పరిణయాది ప్రబంధములను రచియించెనట. ఆప్రబంధము లిప్పు
డెఱుఁగరాకున్నవి. వీణావాదనపాండిత్యముచే నీతనికి "వీణ"
యని యుపనామము చేరియుండును. శ్రీధర వేంకటేశార్యుఁడు
తన గురువని యీతఁ డిట్లు చెప్పుకున్నాఁడు:

శ్లో. యద్వీక్షాఖిలలోకకిల్బిష తమఃకాండస్య చండద్యుతిః
సూక్తి ర్యస్య విరక్తిభక్తి భగవద్బోధప్రరోహావనీ;
బ్రహ్మానందసుధాబ్ధిమంధరగిరి ర్యస్యోపదేశక్రమః
తస్మై శ్రీధర వేంకటేశగురవే కుర్వే ప్రణామాయుతమ్.

ఈ శ్రీధరవేంకటేశార్యుఁడు దక్షిణదేశమువారికి నాఁటికి
నేఁటికిఁగూడ నిత్యపూజ్యుఁడై స్మృతిపథముననున్న మహనీ

యుండెను, మహావిద్వాంసుఁడు. బహుగ్రంథకర్త. పుణ్యపురుష కథాకీర్తనలోభమునఁ బ్రసక్తానుప్రసక్తమయినను దచ్చరిత్రము నిక్కడ నించుక ప్రస్తుతించుచున్నాను.

శ్రీనర వేంకటేశార్యుఁడు ఆంధ్రవైదిక బ్రాహ్మణుఁడు. తంజావూరిజిల్లా తిరువిశై నెల్లూరు గ్రామవాస్తవ్యుఁడు; సంపన్న గృహస్థుఁడు. ఒకప్పు డాయన తండ్రిదో తల్లిదో శ్రాద్ధదిన మయ్యెను. బ్రాహ్మణనిమంత్రణమాయెను. గృహమున వంటకము జరుగుచుండెను. తాలింపు పరిమళము ఘ్రాణతర్పణముగా నిరుగుపొరుగులకు వ్యాపించుచుండెను. అట్టితఱి నీవేంకటేశార్యులకో, యన్యులకో కమ్మతగాఁడగు నొకమాలవాఁడు గోగ్రాసమును గొనివచ్చి యీతాళింపుఁ గమ్మచలపు నాఘ్రాణించి క్షుధార్తుఁడై వేంకటేశార్యులను బిలిచి "బాబూ! కమ్మనివాసనలు న న్నూరించుచున్నవి. మీయింట నేదో విందువంటకము లగుచున్నట్లున్నవి. నాకుటుంబమున కింతప్రసాదము పెట్టింపుఁడు. మాకొంపలో నందఱకు నిన్న దిన్నగాఁ దిండిలేదు. ఆకొంటిమి" అని యాచించెను. ఆయన యదివిని చండాల ఘ్రాణదోషముచే నుచ్ఛిష్టమయినదని యూహించెనో, లేక అన్నాతురుని ముందుగా నాదరించుట మంచిపనియే యెంచెనో కాని యీ శాకపాకాదులన్నింటిని వాని కిచ్చివేసెను. శ్రాద్ధమునకుఁ బునఃపాకప్రయత్నము సేయఁజూచెను. ఊరిలోని దాక్షిణాత్యనైష్ఠికు లీవిషయము వినిరి. ఆంధ్రుఁడు చెడెనని తెగడిరి. బ్రాహ్మణార్థము రామనిరి. ఊరెల్ల నట్లుడికిన ట్లుడుకుచుండెను. వేంకటేశార్యులయింట వంటకుఁ దోడువచ్చువారును

వెడలిపోయిరి. శ్రాద్ధకర్మ లోపము కలుగుచున్నట్లుండెను. వేంకటేశార్యు లూరివారినెల్లరఁ బిలిచి "శ్రాద్ధము గతియేమి? నేను దోషముచేసితినిగాక! ఎట్టి దోసమునకేని ప్రాయశ్చిత్త ముండును గదా! నాతప్పిదమున కేదో నిష్కృతిని విధింపుఁడు" అని కోరెను. "గంగాస్నానముఁ జేసినఁగాని మీకుఁ బవిత్రతకల్గ"దని యూరిధర్మసభవారు తీరుపుచెప్పిరి. "ఇంతేకదా! అట్లే గంగాస్నానము,చేయుదును; చిత్తగింపుఁడు."అని యాయన లోనికరిగి కొంతవడ వుపాస్తి నెఱపెను. దొడ్డిలోనున్న నూయిపొంగి యానీటితో నిల్లెల్లఁ దడిసెను. ఊరివారెల్లఁ జూడవచ్చిరి. అప్పుడు నూతినుండి సౌవర్ణ కంకణాంకితమయిన స్త్రీహస్త మొకటి స్వర్ణ కలశముతో వేంకటేశార్యులచేతికి జలము నొసఁగెను. దానితో నామహనీయుఁడు సుస్నాతుఁడై కలశము మరల నామె హస్తమునకొసఁగఁగా నది యావలఁ గానరాదయ్యెను. ఊరివా రామాహాత్మ్యమున కబ్బురమంది తమ యపచారమునుక్షమింపుఁడని వేంకటేశార్యులను వేఁడికొనిరి. శ్రాద్ధము సక్రమముగ జరిగెను. నాఁటినుండి నేఁటికిఁగూడ నాశ్రాద్ధము జరిగినతిథికి (కార్తికామావాస్య) వేలకొలఁదిగాఁ బ్రజలరుగుదెంచి యాతిరువశి నెల్లూరఁగల వేంకటేశార్యుల నూతినీట స్నానముచేయుదురు; ఉత్సవము సలుపుదురు. ఆయన వసించినగృహ మిటీవల చక్కఁబరుపఁబడి దక్షిణదేశమున భగవద్భజనగృహముగాఁ జేయఁబడినది. "అయ్యావాళ్"అని వేంకటేశార్యులకు రూఢినామమయ్యెను. ఈవేంకటేశార్యులకథను దాక్షిణాత్యులెల్లరు నెఱుంగుదురు. వేంకటేశార్యులు రచియించిన స్తుతిగ్రంథములు ఆఖ్యాషష్టి, దయాశతకము మొదలగునవి పదునాల్గు ముద్రితము లయియున్నవి

## కృతిభర్త

మగపల రామదాసామాత్యుఁడు. కృష్ణామాత్యుని కుమారుఁడు. ఈతఁడు కావేరీపట్టణము పాలించెనట. కావేరీపట్టణము తంజావూరిజిల్లలో గౌరీమాయూరమునకుఁ జేరువనున్నది. చెన్నపురిచెంతఁగల చిల్కాసముద్రమునకుఁ బ్రళయకావేరి యని పేరు గలదట. అక్కడ నేదేని పట్టణ మానాఁడు గలదేమో? కందుకూరి వీరేశలింగం పంతులుగారి కవులచరిత్రమునఁ గృతిపతి నివాసస్థానము "ప్రళయకావేరీపట్టణము" అని వ్రాయఁబడినది. ప్రళయకావేరీ మహాపట్టణ మిప్పుడు తెలియరాకున్నది. ఇందు "వీక్షామాత్ర ఫలప్రదప్రణయకావేరీ మహాపట్టణాధ్యక్షా" అని యుండుచోట, 'ప్రణయ' 'ప్రళయ'గా మారినదేమో? కృత్యవతరణిక దొరకనేని కృతిపతివిషయ మెక్కువఁగా తెలియఁగనగునేమో?

## కృతిరచనాకాలము

కృతికర్త కుమారుఁడు అళఘురియను పేరుగలవాఁడు. మధురనాయకులలో నళఘురి ప్రసిద్ధుఁడు. తంజావూరి రాజ్యమును పాలించుటకు విజయరంగచొక్కనాధునిచే నాతఁడు పంపఁబడెను. కామేశ్వరకవి సత్యభామాసాంత్వన మాతనికే యంకితము. ఈయళఘురి మన వెంకటపతికవికిఁ గూడ నాశ్రయమై యుండవచ్చును. తత్కృతజ్ఞతాసూచకముగాఁ దనకొమారున కాపేరు పెట్టియుండవచ్చును. అళఘురి క్రీ. 1700 ప్రాంతముల వాఁడు. మనకవియు నాకాలము వాఁడే. శ్రీధర వేంకటేశార్యులకాలమును 1700 ప్రాంతమని తెలియవచ్చుచున్నది.

వెడలిపోయిరి. శ్రాద్ధకర్మ లోపము కలుగుచున్నట్లుండెను. వేంకటేశాచార్యు లూరివారినెల్లరఁ బిలిచి "శ్రాద్ధము గతియేమి? నేను దోషముచేసితినిగాక! ఎట్టి దోషమునకేని ప్రాయశ్చిత్త ముండును గదా! నాతప్పిదమున కేదో నిష్కృతిని విధింపుఁడు" అని కోరెను. "గంగాస్నానముఁ జేసినఁగాని మీకుఁ బవిత్రతకల్గ"దని యూరిధర్మసభవారు తీరుపుచెప్పిరి. "ఇంతేకదా! అట్లే గంగాస్నానము. చేయుదును; చిత్తగింపుఁడు." అని యాయన లోని కరిగి కొంతదడ వుపాస్తి నెఱపెను. దొడ్డిలోనున్న నూయి పొంగి యానీటితో నిల్లెల్లఁ దడిసెను. ఊరివారెల్లఁ జూడవచ్చిరి. అప్పుడు నూతినుండి సౌవర్ణ కంకణాంకితమయిన స్త్రీహస్త మొకటి స్వర్ణ కలశముతో వేంకటేశాచార్యులచేతికి జలము నొసఁగెను. దానితో నామహనీయుఁడు సుస్నాతుఁడై కలశము మరల నామె హస్తమున కొసఁగఁగా నది యావలఁ గానరాదయ్యెను. ఊరివా రామాహాత్మ్యమున కబ్బురమంది తమ యపచారమును క్షమింపుఁడని వేంకటేశాచార్యులను వేఁడికొనిరి. శ్రాద్ధము సక్రమముగ జరిగెను. నాఁటనుండి నేఁటికిఁగూడ నాశ్రాద్ధము జరిగినతిథికి (కార్తికామావాస్య) వేలకొలఁదిగాఁ బ్రజలరుగుదెంచి యాతిరువళి నెల్లూరఁగల వేంకటేశాచార్యుల నూతినీట స్నానముచేయుదురు; ఉత్సవము సలుపుదురు. ఆయన వసించినగృహ మిటీవల చక్కఁబరుపఁబడి దక్షిణదేశమున భగవద్భజనగృహముగాఁ జేయఁబడినది. "అయ్యావాళ్" అని వేంకటేశాచార్యులకు రూఢినామమయ్యెను. ఈవేంకటేశాచార్యులకథను దాక్షిణాత్యులెల్లరు నెఱుంగుదురు. వేంకటేశాచార్యులు రచియించిన స్తుతిగ్రంథములు ఆఖ్యాషష్టి, దయాశతకము మొదలగునవి పదునాల్గు ముద్రితము లయియున్నవి

## కృతిభర్త

మగివల రామదాసామాత్యుఁడు. కృష్ణామాత్యుని కుమారుఁడు. ఈతఁడు కావేరీపట్టణము బాలించెనట. కావేరీపట్టణము తంజావూరిజిల్లలో గౌరీమాయూరమునకుఁ జేరువనున్నది. చెన్నపురిచెంతఁగల చిల్కాసముద్రమునకుఁ బ్రళయకావేరి యని పేరు గలదట. అక్కడ నేదేని పట్టణ మానాఁడు గలదేమో? కందుకూరి వీరేశలింగం పంతులుగారి కవులచరిత్రమునఁ గృతిపతి నివాసస్థానము "ప్రళయకావేరీపట్టణము" అని వ్రాయఁబడినది. ప్రళయకావేరీ మహాపట్టణ మిప్పుడు తెలియరాకున్నది. ఇందు "వీక్షామాత్ర ఫలప్రదప్రణయకావేరీ మహాపట్టణాధ్యక్షా" అని యుండుచోట, 'ప్రణయ' 'ప్రళయ'గా మారినదేమో? కృత్యవతరణిక దొరకనేని కృతిపతివిషయ మెక్కువఁగా తెలియఁగనగు నేమో?

## కృతిరచనాకాలము

కృతికర్త కుమారుఁడు అళఘురియను పేరుగలవాఁడు. మధురనాయకులలో నళఘురి ప్రసిద్ధుఁడు. తంజావూరి రాజ్యమును బాలించుటకు విజయరంగచొక్కనాథునిచే నాతఁడు పంపఁబడెను. కామేశ్వరకవి సత్యభామాసాంత్వన మాతనికే యంకితము. ఈయళఘురి మన వెంకటపతికవికిఁ గూడ నాశ్రయమై యుండవచ్చును. తత్కృతజ్ఞతాసూచకముగాఁ దనకొమారునకా పేరు పెట్టియుండవచ్చును. అళఘురి క్రీ. 1700 ప్రాంతముఁవాఁడు. మనకవియు నాకాలము వాఁడే. శ్రీధర వేంకటేశార్యులకాలమును 1700 ప్రాంతమని తెలియవచ్చుచున్నది.

# శృంగార రాధామాధవము

ఉత్తరభారతదేశమున రాధాకృష్ణులు ప్రకృతిపురుషులుగా స్తుతింపఁబడుదురు. శ్రీకృష్ణమూర్తికి రాధాదేవి మేనత్త యగునని దక్షిణభారతదేశమునఁ బ్రతీతిగలదు. ఈప్రతీతి కాకరమేదో తెలియలేదు. ఈకృతిలో రాధాకృష్ణుల శృంగారలీలలు, సాటిలేని చాతుర్యముతో వర్ణితము లయినవి. రాధామాధవుల ప్రథమానురాగము, రాధావిరహాము, శుకసందేశము, రాధామాధవుల సంవాదము,సవతులసంభాషణములు నిందు నెఱజాణతనపు నేర్పుతో నిర్వహింపఁబడినవి. ఈకవిరసనాంచలమున నాంధ్రవాణి యత్యుల్లాసముతో నృత్యమాడినది; పరిమళముగల పలుకుగుత్తులను బద్యరూపమున విరఁజల్లినది. శృంగారకృతికి సంగతములుగానిక్లిష్టపదములు, ప్రౌఢార్థములు నిందుఁ గానరావు. కవి రాధోక్తులను జెప్పునప్పుడాఁడుదిగా మారినాఁడు. అన్యాసక్తులయినవల్లభులపై నక్కసుగొను కటారికత్తెల తుటారముల నీకవి పుడికిపుచ్చుకొని యీగ్రంథమునఁ బొసఁగించినాఁడు. గ్రంథము పయికిఁబయికిఁ బోనుపోను రసోద్రేకము గల్గించునదిగా నున్నది. ముద్దుపళని రాధికాసాంత్వనరచన కిది మేలుబంతి. రసికులహృదయమున కిది రంజకమగునేని మాపరిశ్రమము ఫలవంతమగునుగాక.

అక్షయ మార్గశిర శుద్ధ పంచమీ గురువారము

గంటి సూర్యనారాయణశాస్త్రి
సంపాదకుఁడు.

శ్రీః

38

# శృంగార
# రాధామాధవ సంవాదము

ప్రథమాశ్వాసము

---

శ్రీరుక్మిణీ మనోహర,
కారుణ్యాసుధాసముద్ర, కంసమథన, య
క్రూరాంబరీష సుజనా
క్రూర, చిదానంద, కృష్ణ, గోప, ముకుందా!

వ. అభ్యుదయపరంపరాభివృద్ధిగా నా రచియింపు
బూనిన రాధామాధవసంవాదం బను మహా
ప్రబంధంబునకుఁ గథాక్రమం బెట్టిదనిన:

చ. అనవరత ప్రబోధకర
మహా మిథిలాపురమందు నొక్కనాఁ
డనఘుఁడు ధన్యుఁడౌ జనకుఁ
డార్యులతో సుఖలీల నుండి సొం

పున సకలావతారముల
పుణ్యకథ ల్వివరింప వించుచుం దాం
జనవున వేడెం గృష్ణుకథ
సత్యనిధిన్ శుకయోగిరాయనిన్.

చ. అడిగిన భక్తితోడం బుల
కాంకితుండై నయనాంబుజంబులన్
వెడల ముదంబుధార యదు
వీరునిం గృష్ణుని సన్నుతింపంగాం
బడసితి నెంతభాగ్యమని
పద్మదళాక్షుం దలంచి మ్రొక్కుచున్
బడలికదీరం బాపములు
వాఱంగం భాగ్యము చేర నిట్లనెన్

గీ. జనకరాజేంద్ర! వినవయ్య సావధాన
మతినిం గృష్ణుని చరితము ల్మహిని విందు
మవి రుచింపవు మాకు మాయనుభవంబు
చెలంగు శృంగారరూపమాం జిత్తగింపు.

కు. యమునాతీరమునందు బృందదరి బా
గా పల్లె వ్రేపల్లెనా

సమరుఁ గొల్లలపల్లెత జ్జనుల భా
  గ్యం బెంతవర్ణింతు మొ
ల్లముగా నందఱుఁ గొల్లలాడుదురు పా
  ల న్నేతఁ, దన్నేతమై
యమితానందుఁడు నందుఁ డందుఁ దగు
  దేవాధీశభోగంబులన్.

సీ. తిరుగాఁ గైసేయు తేపులచందానఁ
  బాదుగులతోడ నాఁగదుపు లమరఁ
గనుఁగానక మదించు గజముల కైవడిఁ
  గొమ్ములవృషభము ల్కొమరు మిగులఁ
జివ్వకు నటు కాలుద్రవ్వు వీరుల రీతిఁ
  జలపోరి పెనఁగు కోడెలు చెలంగఁ
జెంగునదాఁటు తురంగంబుల వితానఁ
  జురుకైన లేఁగలు సొంపుమిగుల
నవియె చతురంగబలములై యతిశయిల్ల
మొల్లమై యున్న వ్రేపల్లె నల్లుకొన్న
ఫలితవనములు కోటలై పరిఘవిల్ల
నందుఁ జెలువొందు నందుఁ డానంద మొంది.

క. ఒకపశువుఁ బ్రోచు వానికి
సకల ఫలంబులును గల్గు, సంతతమును గో
ట్లకు మించు పశుగణంబులఁ
బ్రకటంబుగఁ బ్రోచు నందుఫల మేమందుఽ.

గీ. అతని పుణ్యంబుననో, లేక యతనిపుణ్య
పత్నియగు యశోదాదేవి భాగ్యముననో,
కృష్ణుఁ డుదయించె వారి కింకేమి తెలుప
జలజనయనుని భక్తవాత్సల్య మహిమ.

చ. చిగురుల పాదము ల్కాళలఁ
జిల్కెడువ్రేళ్లు నోయారి పిక్కలుఽ
జిగితొడ లందపుంబిఱుఁదుఁ
జెన్నగుబొజ్జ వెడందఱొమ్ము బా
గగు కరము ల్మనుంగళము
నద్దపుఁ జెక్కులు నవ్వుమోము దే
టగు కనుదోయి ముద్దు గురి
యఽ మురియుఽ హరి యందుబాలుఁడై.

సీ. పట్టాభియోగ సౌభాగ్యము ల్దిలకించి
నందుండు సంతసానంద మొందఁ

పొట్రుపల్కులు ముద్దుపోలఁకు నవ్వులు గాంచి
మురిసి యశోద సమ్మోదమంద
నవమోహనాంగసౌందర్యంబు భావించి
పసిగాఁపు గుబ్బెతల్ పైఁబడంగఁ
బూఁటపూఁటకు వృద్ధిఁబొందుమానముఁ జూచి
జనులెల్ల నాశ్చర్యమునఁ జెలంగ
తలిరువలె గోమునై మొగ్గవలెను సోగ
యై యలరువలె మృదువునై కాయవలెను
బెక్కువై పండువలె నెఱచొక్కమగుచుఁ
దేనెవలెఁ దేటయై శౌరి తేజరిల్లె.

ఉ. అప్పుడు లేఁతప్రాయమున
నాడుచు నందుని ముద్దుఁజెల్లెలౌ
కప్పురగంధి రాధ యను
కన్నియ యొక్క యనామధేయుఁ బి
న్నప్పుడె పెండ్లియాడి మగఁ
డంచని చూడదు వాని, వాఁడు నా
యొప్పులకుప్పఁ గన్గొనఁగ
నోడును వ్రీడను గొల్లవెఱ్ఱిచేఁ.

# శృంగార రాధామాధవ సంవాదము

క. వెన్నెలను జలువపుట్టిన
చెన్నునఁ బువ్వులను దావి చెలఁగినరీతిన్
కన్నియ సకలాంగంబులఁ
దిన్నఁగ నొకవింత వాడమె దినదినమునకున్

క. వనిత తనుఁదానె చూచుక
తనలోఁ దా నుస్సురను వితాకై తనకున్
దనసొగసుకుఁ దనముచ్చట
కనువైన ప్రియుండు లేమి నాగాటమునన్

క. తొల్లి తప మేమిచేసెనొ
కొల్లగఁ బసిబాలుఁడైన గోపాలునితో
మల్లాడుచు నెల్లప్పుడు
చెల్లాటల నుండు రాధ జిలిబిలితమిచేన్

క. బాలుఁడగు శౌరి నెత్తుక
హేలాగతి ముద్దులాడు నేప్రొద్దు వృథా
కాలక్షేపంబునఁగడుఁ
జాలని వగలేనిబాళి జాల విరాళిన్.

ఉ. భావిఫలాభిలాషమున
బాలుని కేమఱ ఖుగ్గువెట్టుఁ బె

యావ్రులపాలతో జలక
    మార్చును దాఁ దొడనుంచి యేమి చూ
చేవని నవ్వుచున్ బయఁట
    చేఁ దడియొత్తి సిరామరకుతో
గావునఁ జుక్కబొట్టిడు మొ
    గంబున నంత ఘటించు నుయ్యెలన్

ఉ. నా వెలలేనిమానికమ
    నా తొలినోముల మెట్టపంట నా
దేవుఁడ నా మనోరథముఁ
    దీర్ప జనించిన చక్కనయ్య నా
జీవన జీవనంబ యదు
    శేఖర యించుక నిద్రపోగదే
ఓ వెడమాయకాఁడ, యని
    యుయ్యెల నూఁచును రాధ మాధవున్

గీ. ఏమఱించి కృష్ణుఁ డిండ్లలోఁ జొరఁబడి
    యున్నపాలు పెరుగు వెన్న నేయి
    కొల్లలాడుచుండ గోపిక లొకనాఁడు
    దొమ్మిగూడి రాధతోడ ననిరి.

క. ఉట్లపయి నున్న వెన్నల
చట్లెల్లను గొంచుఁబోయి సంగాతులతో
నాట్లాడఁ దొడఁగె మాబ్రతు
కెట్లా కడవెళ్లునమ్మ, యిట్లా గయినన్.

క. ముద్దిమ్మని బలిమిని మా
ముద్దియ చేనున్న వెన్నముద్దలు గొనె నీ
ముద్దులబాలుఁడు నీ కిది
ముద్దయినన్ కొమ్మ, మాకు ముద్దటవమ్మా!

క. బంతులటంచును జెలి చను
బంతులు బిగఁబట్టి లేదు బంతి యటంచున్
గంతులు వైచెను మముఁ గని
కాంతా, పనియాని యెంతగలవారలకున్

క. మందకుఁ జని రాఁగను మా
మందగమన నాఁగి నీదుమగఁ డెవఁ డనుచున్
కందువమాటల నడిగెను
అందమె మనజాతి కిట్టి యాగడము చెలి!

క. నీవైన బుద్ధి తెలుపుము
నీవలనను గాకయున్న నేమె యశోదా

దేవికిఁ దెలిపెద మనఁగా
నావేళకుఁ బిలిమి పుచ్చి యాంఘ వడిన్

క. ముద్దిచ్చును గోపాలుఁడు
వద్దను నడయాడుచున్న వార్తలు విన్నన్
గద్దించును లేదన్నను
బద్దించును జూడకున్నఁ బరితాపించున్

ఉ. ఓయి మనోహరాంగ, పని
యున్నది పోయెదుగాని యిట్లు రా
వోయి మహానుభావ, యని
యూరక పిల్చును; బిల్వ నేమి రా
ధా, యని యాతఁడుం బలుకఁ
దావిని నవ్వుచు వేగ నిందు రా
వోయి, భుజింపఁగా వలద
టోయి, యటంచు వచించు బాళితోన్.

చ. పడుచులతోడ నాడఁ బసి
బాలుఁడవా వలదన్న మాన వా
గడములు కొన్ని నేర్చితివి
కల్లరివైతివి కొల్లకాఁడవై

దుడుకులు సేయసాఁగితివి
  దొంగిలఁ జొచ్చితి వేమి తెల్పినన్‌
వడిగఁ బరాకు చేసికొని
  వాకిటి కేఁగెదు పిల్వఁ బిల్వఁగన్.

ఉ. బుద్ధులు చెల్పఁబోవుగతిఁ
  బొంగుచుఁ గన్నులు పుల్మకొంచునున్
బ్రొద్దున లేచి యిండ్లఁబడి
  పోయెద వమ్మక చెల్ల! పిన్నవున్
బెద్దవు గావు బువ్వ దిని
  పించెదఁ జక్కనిసామి! రార, నా
ముద్దులకృష్ణ! రార, యని
  మ్రొక్కుచుఁ జీరును రాధ మాధవున్.

ఉ. అల్లుఁడ దొండపండువలె
  నాయని వాతెర నాననిచ్చు నీ
కొల్లవె పుట్టచెండు లివి
  గో యని చన్గవఁ బట్టనిచ్చు రా
గిల్లి మయూరపింఛ మడి
  గేవని పెన్నెరు లంటనిచ్చుఁ బో

కల్లరి యంచుం గృష్ణుం డసఁ
గా నగి రాధ యదేమిరా యనున్.

సీ. తీరుగాఁ గస్తూరితిలకంబు దిద్దుచో
గమకించి నెమ్మోముఁ గదియఁజేర్చు
హొయలుగా గంధంబు మెయినిండఁ బూయు
బరికించి యిక్కువల్ గరఁగ నంటు [చోఁ
మెలపుగా సిగను బూవులదండఁ జుట్టుచోఁ
బులకించి కుచము వీఁపున ఘటించు
హరువుగాఁ గై సేసి యద్దంబుఁజూపుచోఁ
దిలకించి తనమోముఁ దెలియఁజూపుఁ
జెలఁగి మాటాడఁబోవుచోఁ జెక్కు గీటు
పిలిచి వీడెం బొసంగుచోఁ బెదవిఁ గ్రోలు
కదిమి పైఁబడఁదిగుచుచోఁ గౌఁగిలించుఁ
దమి మనంబున నాఁటి రాధావధూటి.

క. కడి మాడ నేయు భోజన
మిడుఁ బిడికిట నిముడువలువ లిచ్చును బెడఁగా
తొడవులు దొడుగును బడిబడి
గడెగడె కొకవింతసొగసు గావించు హరిన్.

సీ. ఎవతెతో సయ్యాట మింటిలోన నటించు
భయపడ నదలించు బయటనుండి
చంటితైక సడల్చి జారుపైట ఘటించి
యేది బాగని వేఁడు నెదుట నిల్చి
వాకిట మగవారు రాకుండ నిలుమంచుఁ
జలువకోక ధరించుఁ దలుపుమూల
దాఁగనేరవు పల్కు దారిగాదని దూరు
వలదని మురిపాన వద్దఁజేరు
నాఁడునాఁటికిఁ గోపాలుఁ డీడుమీఱి
తొలుత నూనూఁగుమీసాలతోఁ జెలంగఁ
బదరి మునువలెఁ బైఁ బ్రక్కఁబడఁగ నళికి
బెళఁకువగఁ గుల్కు మరునికి బెదరి రాధ.

క. ఆరాధ మనోజవ్యథ
నీరీతుల నిరుగుపొరుగు లెఱుఁగకయుండన్
గారాబు సేయఁ గృష్ణుఁడు
చేరక తా నది పరాకుచేయుచునుండెన్

సీ. తొలుదొల్తఁబసిగాపుఁ గులుకుగుబ్బెత యొంటి
పాటైన మోము తప్పకయె చూచుఁ

జూపు వెంబడిఁ దన్నుఁ జూచి సిగ్గున నిల్వఁ
దలయూఁచి కోరికల్ దెలియ నవ్వ
నవ్వు వెంబడిఁ జిన్ననాఁటి మచ్చిక లెంచి
నను నయో, దయఁ జూడవనుచుఁ బలుకు
బలుకు వెంబడిఁ గేలఁ బైఁటకొం గెడలించి
నునుజన్ను లాన ఱొమ్మునకుఁ జేర్చుఁ
జేర్చి మొనపంట జిగిమోవిఁ జీరనొక్కు
నొక్కి సొక్కించి మరుకేళి స్రుక్కఁ జేయుఁ
జేసి కనుమాటి యింటికిఁ జేర నరుగు
నరిగి తను గానిరీతిఁ దనంత నుండు.

క. ఆచిన్నెలు సవసవగాఁ
జూచాయఁగ విని చలించి స్రుక్కిన రాధన్
జూచి యదేమే రాధా
నాచాయన్ సిగ్గువడెదు నా హరి కనియెన్

సీ. చెంత నీవును లేనిచింతతోఁ బవళించి
నిదురవోవుచునుండ నిన్న రేయి
కలలోన నొక్క చక్కనిరాచకొమరుండు
దోఁచె నెవ్వఁ డటంచుఁ దోఁచదాయె.

నొకకొంత సేపు తప్పక చూడఁజూడంగ
    నీపోలికై యున్న నీవటంచు
"రార కృష్ణా" యని బారతోఁ జేసాఁచ
    "నేమి రాధా" యని యెదురుకొనుచు
నెనసి యేమేమొ వింతగా నింపొనర్చె
నంత మేల్కాంచి నినుఁగాంచి యది దలంచి
మురిపెమున నిన్నుఁజూడక మోము వంచు
కొంటి నా సిగ్గు నేమనుకొందునోయి!

మ. అనినన్ బక్కున నవ్వి చిక్కితివి రా
    ధా, సాధువే యంచునుం
టిని నీనాథునిమీఁది ప్రేమ వినఁ గం
    టిన్ తుంట విల్తుంటవెం
టనె నంట న్ననవింటితూపు లెదనం
    టన్ తుంట లింకేల నీ
ధ్వనివాచారసభావభావభవగా
    థల్ నీవగ ద్దెల్పెడిన్

క. విరి దాఁచఁ దావి దాఁగునె
    పరిపరి పలుకేల నిజము పలికితి వౌనా

ధర వినమె "సత్యవాణీ
సరస్వతీ" యన్నమాటఁ జదువులలోనన్.

క. అనిపల్కు శౌరిపలుకుల
కును మెచ్చుచు నిన్నినాళ్లకును నీవైనన్
మనసెఱిఁగి చిక్కఁ బట్టితి
దనుఁబో యని కృష్ణుతోడఁ దా నిట్లనియెన్.

సీ. కండచక్కెరపానకంబు గావలెనందు
వది గోరవేమిరా యంబుజాక్ష!
రంగు బంగరుబొంగరాలు గావలెనందు
వది గోరవేమిరా మదనజనక!
యిసుక తిన్నెలమీఁద నెక్కఁగావలెనందు
వది గోరవేమిరా మదనరూప!
తోడిబాలురతోడ నాడఁగావలెనందు
వది గోరవేమిరా యమరవంద్య!
తియ్యనైయున్న కెమ్మోవి తేనె వలతో?
జంటగొనియున్న యలచన్ను లంటవలతో?
త్రొక్కి కదిసిన పిఱుఁదుల నెక్కవలతో?
జోడువాయక స్త్రీలతో నాడవలతో?

నాకకొంతసేపు తప్పక చూడఁజూడఁగ
నీపోలికై యున్న నీవటంచు
"రార కృష్ణా" యని బారతోఁ జేసాఁచ
"నేమి రాధా" యని యెదురుకొనుచు
నెనసి యేమేమొ వింతగా నింపొనర్చి
నంత మేల్కాంచి నినుఁగాంచి యది దలంచి
మురిపెమున నిన్నుఁజూడక మోము వంచు
కొంటి నా సిగ్గు నేమనుకొందునోయి!

మ. అనినన్ బక్కున నవ్వి చిక్కితివి రా
ధా, సాధువే యంచునుం
టిని నీనాథునిమీఁది ప్రేమ వినఁ గం
టిన్ తుంట విల్దొంటవెం
టనె నంట న్ననవింటితూపు లెదనం
టన్ తుంట లింకేల నీ
ధ్వనివాచారసభావభావభవగా
థల్ నీవగ ల్దెల్పెడిన్.

క. విరి దాఁచఁ దావి దాఁగునె
పరిపరి పలుకేల నిజము పలికితి వానా

ధర వినమె "సత్యవాణీ
సరస్వతీ" యన్నమాటఁ జదువులలోనన్.

క. అనిపల్కు శౌరిపలుకుల
కును మెచ్చుచు నిన్నినాళ్లకును నీపైనన్
మనసెఱిఁగి చిక్కఁ బట్టితి
దనుఁబో యని కృష్ణుతోడఁ దా నిట్లనియెన్.

సీ. కండచక్కెరపానకంబు గావలెనందు
వది గోరవేమిరా యంబుజాక్ష!
రంగు బంగరుబొంగరాలు గావలెనందు
వది గోరవేమిరా మదనజనక!
యిసుక తిన్నెలమీఁద నెక్కఁగావలెనందు
వది గోరవేమిరా మదనరూప!
తోడిబాలురతోడ నాడఁగావలెనందు
వది గోరవేమిరా యమరవంద్య!
తియ్యనైయున్న కెమ్మోవితేనె వలతో?
జంటగోనియున్న యలచన్నులంటవలతో?
త్రొక్కి కదిసిన పిఱుఁదుల నెక్కవలతో?
జోడువాయక స్త్రీలతో నాడవలతో?

## శృంగార రాధామాధవ సంవాదము

గీ. నీకువాడ మెల్ల నిన్న రాతిరి గంటి
నమ్మచెల్ల! నిన్ను నమ్మరాదు
నవ్వుగాదు రేయి నాప్రక్కలో నుండి
కలువరించలేదె చెలులనెల్ల.

ఉ. అందముల కాసయేని మగ
నాండ్రపయింబడి దూఱునోందఁగా
నెందుకుఁ గంటి కింపయిన
యింతుల నల్గురిఁ బెండ్లిసేయనో
పొందుగఁ బ్రొద్దుపోకలకుఁ
బూనితి వేనియు మేము నేరమో
యందఱవంటి ముచ్చటలు
నాటలు పాటలు నోటిమాటలున్.

క. చిన్నప్పుడె యెడబాయక
కన్నుల నిన్నెపుడుఁ జూడఁగలిగుండుమ నేఁ
డెన్నంగ నీదుసముఖము
క్రొన్నెల పొడుపయ్యె గగనకుసుమం బయ్యెన్.

చ. అరమర లేక నీకొఱకు
నల్లికబిల్లికగా•వసింతు మి

ద్దర మపు దెవ్వరిన్ మసలఁ
    •దాఁకి తలంచవు నేఁడు వింటివో
మఱి వినలేదో యీజనుల
    మాటలు వాడల నాడనాడ నీ
పరువులుచూచి నాపయిని
    బాపముఁ గట్టి రిఁకేమి తెల్పుదున్.

క. మచ్చరమున నొక రనుకొన
నొచ్చెము నాయందుఁగలదె యొకనాఁడైనన్
ముచ్చటగా నినుఁ గౌఁగిటఁ
గ్రుచ్చితినో లేని చొరవకుం జొచ్చితినో!

క. నే నిందుకొఱకె నవ్వన
హా నోడుదు వట్టినింద లందితి నయ్యో
యైన దిఁకనాయె నందుకె
ప్రానుద మందఱికిఁ గన్నుపొడిచిన రీతిన్.

క. నామనసులోని కోరిక
నీమజనంబులె నిజంబు చేసిరి మన కీ
నేమం బెందుల కీవఱ
కేమాయెను గొదవ లోకు లిటులాడుటచేన్.

సీ. చూడనేర్చిననాఁడె సొలపుగా మునుమున్న
చేరంగ నను( గటాక్షించినావు
నవ్వనేర్చిననాఁడె ననువుగాఁ దొలుదొల్త
నాతోడ వగగుల్క నవ్వినావు
పల్కనేర్చిననాఁడె భావంబుగా ముందు
నత్తత్త రమ్మని యాడినావు
నడవనేర్చిననాఁడె నమ్మికగాఁ దొల్తఁ
దొడరి చేపట్టి కాల్ ద్రొక్కినావు
నాఁడు సేయని యోచన నేఁడు గలదె
మరుఁడు దైవంబు సాక్షులు మనమనములు
విను సదాచారనిరతులు విబుధులైన
ఘనులు తారాశశాంకులు గారె మనకు.

చ. అనవిని రామరామ యిటు
లాడఁగఁజెల్లునె నీకుఁ; గాక నా
మన సరయం దలంచితివొ
మక్కువతోఁ గరుణించి నీవు పెం
చిన తను; వింత నీ వగడు
సేసిన కాదనువార లెవ్వ? రిం

దున కొండిగట్టినన్ విదప
దోసముగాదటె రాధికామణీ!

క. నీతోడం జర్చసేయంగం
బోతే నామనసు కొకటి పొడమినం బొడమున్
నీతోడం బలుకరా దిక
వా తప్పితి మొదల పదుచువాండను నేనున్

క. అని విఱుగనాడి యంతనె
తనసంగడికాండ్రు పిలువం దా నాపలుకుల్
విని హాయని యెలుం గిచ్చుచు
వనజాక్షుం డరిగె మరల వచ్చెద ననుచున్

చ. రమణియు నంతం జే దొరకు
రత్నము నాంచుకపోయినట్టు లోం
గుములుచు నేరికిన్ దెలుపం
గూడక దొంగను దేలుగుట్టు చం
దమునం దపించుచు న్నలిన
నాభుండు మున్ విడ నాడినట్టి వా
క్యములకు సంగతుల్ దఱచు
గాం దలపోయుచుం జింత సేయుచున్.

## శృంగార రాధామాధవ సంవాదము

గీ. పొరుగులిరుగుల చెలులతోఁ బోయె ననుచుఁ
గొండెములు చెప్పిన యశోద కోపగింప
శౌరి రూపింపుమని తన్నుఁ గోర నెవరి
నడుగవచ్చెదు పడుచుల నడుగు మనును.

సీ. పనిలేనిపని జారు పైఁటతో నడయాడు
ముసిముసి నగవుతో మోమువంచు
గడెగడెకొకవింతగా మేను గైసేయు
తోడిబోటుల వృథా దూరి పలుకు
పలుమారు ముంజేతిచిలుకను ముద్దాడు
కని కానములుగఁ గ్రేగంటఁజూచు
నొంటిపాటైనచో నుస్సురుమని నిల్చు
తనుఁ జూచునెడఁ జురుకునఁ దొలంగు
నవల నివలను గుసగుసల్ సవసవలుగ
వినియు వినములుగాఁ జేసికొనుచు మొదటి
నీటులకుఁ బోక పోవక నిలువలేక
మరియు నీలీల గోపాలు మ్రోల రాధ.

క. డాయు నటుచెంతఁ బిలిచితి
వా యను నిను నేనుఁ బిల్వనంచన నట్టే

పోయ నునుఁబువ్వు లిడినలె
నే యను నవిపల కటన్న నిఁక నెట్టు లనుఁ.

ఉ. ఘల్లున మ్రోయ నందియలు
గజ్జెలు మువ్వలు సందడించఁగా
నల్లని మేనిఛా లమర
నవ్వుచు నల్లన నీవు రాఁగ రా
గిల్లుచు బాహుతోఁ డిగియ
గిల్లెద నేమిర మెల్లమెల్ల నే
యల్లుఁడ యర్ధ వియ్యమని
యందురు గావున నెవ్వఁ డేమనున్.

క. రారా నందకుమారక,
రారా నవనీతచోర, రారా కృష్ణా,
రారా రాజులమేలిక,
రారా ముద్దులమురారి, రారా శౌరీ!

శా. రారా నందకుమార, రార యదువీ
రా, రార రాకాసుధా
ధారాకార మనోహరాంగ, దయలే
దా మైన నాయిరిటికిఁ

రారాదా నినువంటివానికిది మే
రా నిన్ను నేమంటిరా
యేరా తిన్నని జుంటి తేనె తెరమో
వీరా మనోవల్లభా!

చ. ప్రకటమనోజరూప పసి
బాలుఁడవంచును నమ్మి ప్రక్కనుం
చుక నిదురించఁగాఁ బుఱుకు
చుక్ గుచముల్ బిగఁబట్టి మేనుమే
నికిఁ గదియించి పల్పెదవి
నిల్పితి వేమిర మేనమామ పో
లికలకు వచ్చినాఁడవా? భ
ళీ యనుచుక్ దలయూఁచి నవ్వుచుక్.

గీ. ఒంటి నెదురైన రాధ యోరోరి కృష్ణ!
తాళుతాళు మటంచనఁ దాళు శౌరి
పదుగురున్నప్పుడొకమారు పైఘటించి
తాళుతాళు మటంచనుఁ దనకుఁదానె.

చ. విడువిడు నీకొసంగ నని
పేటొకబాలున కొక్క తియ్యమా

మిడిఘల మీయఁబోవ బలి
మిం గొని తా మొనపంటనొక్కి గ్రు
క్కుఁడురసమాని సీత్కృతు లొ
గిం జెలఁగం దలయూఁచిచూచెఁ గే
రడమున రాధికా మధుర
రాగసుధాధరవీటి సారెకున్.

క. ఆముద్దు చూచి రాధిక
యేమఱితి నదేమిచూచి తీవన నగి నే
నేమి నినుఁ జూచినట్టులు
నీమదిఁ దోఁచినది తెలుపు నీవని వేఁడన్.

చ. తెలిపెద రమ్మటంచు సుద
తీమణి దుప్పటికొంగుఁబట్టి లో
పలి పడకింటికిన్ దిగువఁ
బద్మదళాక్షుఁడు మోడిమానిసిం
బలెఁ జని తెల్పుమం చనిన
మంచిది పానుపుఁ జూడుమన్న ని
శ్చలుఁడయి కొంత సేపునకు
జవ్వనిఁ దప్పక చూచి యిట్లనున్

## శృంగార రాధామాధవ సంవాదము

ఉ. మొన్ననె తెల్పలేదటవె
    మొన్నటి నిన్నఁటి పిన్నవాఁడ నాఁ
కొన్నను నీవు భోజనము
    గోరియిడన్ వలె నెత్తి పెంచినా
వెన్నఁడులేని మాట లిటు
    లేటికి నాడెదు మాటిమాటికిన్
కన్నులఁజూడు మల్లుఁడను
    గానటవే యన రాధ యిట్లనున్.

సీ. పసిబాలుఁడందునా, పరికింప నూరిలో
    నీవు దూరనియట్టి యిండ్లు లేవు
పగఁ గానవందునా, మగఁడు నీవే యని
    నీరాకఁ గోరని నెలఁత లేదు.
విననేరవందునా, విద్యల యొరగల్లు
    నీవెఱుంగనిపాటి నీతి లేదు
దయఁజూడవందునా, ప్రియముతో నయముతో
    నీవు లాలించని నెలఁత లేదు
యన్నిటను జాణవేయాడు వైన నాదు
కూర్మినెఱుఁగని దొక్కటే కొదవగాని

నీకు నీయంతఁదోఁచని నెనరుఁ బ్రేమ
వచనరచనలఁ దెల్ప నెవ్వరితరంబు?

ఉ. పెంచినదానవంచు తలఁ
    పించెదు సారెకుసారె నీదుప్రా
పెంచినదాన నౌదు నిది
    యెన్న రహస్యము మాలి పిల్కులన్
వంచనలేక పాది నిడి
    వారక పోషణచేసి పెంపుగా
వించుట తత్ఫలం బనుభ
    వింపనొ యన్యులపాలు సేయనో!

మ. వినరా వావులకేమి కాముకుల ముస్
    విన్నాము కన్నాములే
నినుఁబోలంగలవానిఁ గాన మవులే
    నీనేర్పు; లోకంబులె
ల్లను గల్పించినధాత భారతికి నే
    లా ల్లోలుఁడై వావిగ
కొనఁ డౌఁగా యిటువంటి సామెతలు నీ
    కు న్నాకుఁగా నున్నవే?

ఉ. లేదని కుందిరా ఫలము
లేదని దైవము దూరనేల? నీ
కే దయరావలెన్ వెనుక
నీవె తలంచుక చేరదీవలెన్
కాదని పైకొనన్ వరుస
గాదని నిన్నెద నమ్మియుంటి నీ
వే దయలేక నన్నుఁ గడ
కింతకుఁ దెచ్చుట నేఁ డెఱింగితిన్.

శా. ఓహో! యత్తను సంతసించె నవిని నత డా
యుష్మంతుఁ డౌనంట నా
యూహాలోకము సామెతాయె నన వే
దోక్తంబు గాదందువే
నాహా మంచిది భూమి సామికిని న్యాయై
యుండి యత్తోట సం
దేహంబా యిది వేదమంచె వినవా?
నీమాట నీకే తగున్.

ఉ. ఎన్నఁడు పెద్దవాఁడవవు
దెన్నఁడు జాణతనంబు నేర్తు వీ

వెన్నుఁడు నామనంబు ఫలి
యింపఁగఁ జేయుదు వంచుఁ గోరి నే
నున్నది వల్లవీజనుల
యుల్లముఁ జల్లఁగఁజేసి మెచ్చుకొం
చు న్ననవింటి వానిపని
చూఱలువెట్టుటకా మనోహరా!

ఉ. భూషణభూషితాంగ పరి
ఫుల్ల సరోరుహనేత్ర నీకు సం
తోషము వచ్చినప్పుడె న
నుం దయఁజూతువు గాక యూరకే
దోషమటంచు నన్నొతలఁ
ద్రోయకు; నేనిఁక మాన; నీవపు
ర్వేషవిలాస మేఘము భ
రించెద మ త్కుచపర్వతంబులన్.

క. విను, కాకుండిన వేఱొక
తనువున నినుఁ జెట్టఁబట్టఁ దలఁచెద; నపుడున్
వినవేమొ! వావివరుసలు
తనువుల కర్మంబొ జీవధర్మమొ చెపుమా?

వ. అనిన నబ్బాలికామణికి గోపాలచూడామణి
యిట్లనియె:

ఉ. క్రమ్మిక యెన్ని పలె
కానివి పోనివి గుంపుసేసి వే
దమ్ములు నీతులుం దగవు
ధర్మము శాస్త్రములున్ స్మృతుల్ పురా
ణమ్ములు; నీకుఁ జక్కనయి
నన్ వినువారికిఁ జక్కనౌనె నీ
సమ్మతు లూరివారలకుఁ
జాటవలెంగద నేఁడు ముందుగన్.

ఉ. మంచితనానఁ గాదనినఁ
మాటలు నీ కెగపోఁతలయ్యెఁ నా
నంచు భవత్ప్రియంబునకు
నై వినినం గొఱగా దిదేల? నీ
కించుక వల్ల నేమి? యొక
యించుక వావి దలంచుకొమ్ము మ
న్నించుము నన్ను ముచ్చటయు
నేస్తముఁ జాలదె రాధికామణీ!

ఉ. వెంటనె పాపమేల యవి
 శోకము గట్టెదు వావిగాదు న
న్నంటకు మన్న అంతులిడి
 యల్లుని మంచితనంబు లేదు పొ
మ్మంటివి; యత్తసేయుపని
 కాఅడి లేదనుటే నిజంబు నీ
వంటి యభిజ్ఞురాలి కిటు
 వంటివి మంచివొకో తలంపఁగాఁ.

గీ. అవనిఁ గాంతలు స్వేచ్ఛావిహార లగుట
తెలిసియేకాదె బ్రహ్మ విధించినాఁడు
మగువ కొక్కఁడె మగవాఁడు మగఁడుగాఁగ
రాధ, యిది ధర్మశాస్త్ర విరోధముగద!

వ. అనిన గోపాలగ్రామణికి రాధికావధూమణి యి
ట్లనియె:

క. మహి దేహసుఖ మెఱుంగక
తహతహపడి పరసుఖంబుఁ దాఁ గన కిహామ్ముఁ
నహి పరము న్నహియైతే
సహజమయామగనిఁ గొలువఁజల మోఫలమో?

మ. గతి వీఁడంచును బిన్ననాఁడు తమవే
    డ్కన్ పెద్ద లొప్పింతు; రె
వ్వతె కెవ్వాఁడు మగండు కాసరు; మనో
    వాక్కాయకర్మంబులన్
పతి యెవ్వాఁడని తోఁచె వాఁడె పతిగా
    భావించు నాలే పతి
వ్రత; నాసమ్మత మీమతంబు; చెడుత్రో
    వన్ బోవ నేవెట్టినే?

క. ఒక్కటిగల సైన మనో
వాక్కాయములందుఁ జెడ్డవారలత్రోవల్
ద్రొక్కక మఱ్కువ నొక్కఁడె
దిక్క ని దక్కినదియే పతివ్రత తలఁపన్.

క. మగఁడు మగండని మగువలు
తగవులు నడపిననుగాక తమ రొల్లనిచో
నగుఁగాదని దండించునె
తగవున ధర్మాసనమునఁ దగి మగఁ డోహో!

క. నిను నాఁ గాదననమా
యన వెఱతునుగాని మిగిలినందుల కైతే

విను వారు వీరు నోఁ గా
దనఁగాఁ బనియేమి యొకరికై బ్రతికెదనే?

చ. బుడుతవు నీ వసద్దతన
ముల్ పచరించెదు బుజ్జగించి నే
నడిగినఁ బాపమం చనెద
వంతకు నీకుఁ బనేమి నీకుఁగా
బడిబడిఁ బాలనాఁడు మఱి
పాలును నుగ్గిడునాఁడు నుగ్గునుఁ
నడపుచు నేనె పెంతునట
నాకు స్వతంత్రము లేకపోయెనే?

చ. పలుకుల కేమి? యేవగను
బల్కఁగ నేరవు; నిన్ను మించి యు
క్తు లుపచరింప నాతరమె?
తొల్లిటివారల యాడికోలుమా
టలెకద పల్కఁబోయిన నో
డంబడికల్ పనిగావు నాపయిఁ
చలమొ ఫలంబొ? యేల కర
సానలఁబట్టెదు వ్యాక్తికంబులఁ?

ఉ. పాపము పుణ్యమేర్పఱుపఁ
బాల్పడినాఁడవె నీవు; నీకు నీ
పాపము లేల? నీకొఱకుఁ
బైఁబడిఁ దీనత బొందఁ జేసె నా
పాపము; నిన్నుఁ గూడఁగల
భామల కబ్బెనుఁ బుణ్య; మిందుపైఁ
బాపముఁ బుణ్యముం గలదె
భావమునం దలపోసి చూడఁగన్.

శా. ఏ నామాటలు పూర్వపక్షములుగాఁ
బోనాడి పోనాడి యా
నా నీ మాటలె నిల్పుకొంటి వవి సి
ద్ధాంతంబుగాఁ జేసి; నీ
తో నింకేటి వితండముల్ పలుక నే
ర్తు న్నేఁటితో నిగ్రహ
స్థానంబైతిని; నీవు దెల్పు పలుకే
శాస్త్రంబు చర్చింపఁగన్.

క. శృంగారకవితవంటిది
యంగనఁ గడుఁ బ్రేమచేత నానందముతో

నంగీకరించినం దగు
భంగంబున కోర్వఁగలవె భావజ్ఞనిధీ!

చ. లలితుఁడ వౌదువంచు మొద
లం జదివించిన వెల్ల నేఁటికిన్
గలిగెను గాళ్లపైఁబడిన
కామినిఁ గాదని వాడవాడలన్
గల మగవాళ్ల కాళ్లఁబడ
గాఁ జదువున్నదె మాట లేల నన్
పొలపునఁ గూడరా కరుణఁ
జూడర చల్లని మాట లాడరా!

క. అల్లుఁడ వైనందులకును
జెల్లుగ నుపకార మొకటి చేయుము నామే
నొల్లఁ గడుఁ గ్రాఁగుచున్నది
చల్లని నీ మేన నొత్తి చల్లార్పు మికన్.

గీ. నన్నుఁ దాఁకినపుడె నామేనికాఁకలు
నిన్ను సోఁకు ననుచు నెన్నవలదు;
నిన్ను సోఁకఁబోదు నిను మున్ను గూడిన
మందసతులతనువులందుఁగాక.

చ. ఇపుడు మదీయవాక్యముల
కేఁగొనవో యని డెంద మూరకే
తెపతెపఁ గొట్టుకాడెడిఁ బ
డింబడిగా నిదె చూడు మంచు న
చ్చపలమృగాక్షి లేచి యల
సారసలోచను కేలుఁదమ్మి నం
దపుటురమందు మోపుకొని
తల్పు బరాలన మూసి కృష్ణునిన్.

ఉ. గొబ్బున శయ్యకున్ దిగిచి
గుత్తపుటబ్బురపుబ్బు సిబ్బెపుం
గుబ్బ లురంబునం దలమి
క్రుమ్ముచు మెచ్చుచు మోవితేనియల్
జుబ్బనఁ జూఱగాఁ గొనుచుఁ
జొక్కుచు ముద్దులఁ గొల్లలాడెఁ ద
బ్బిబ్బయి కొంతసేపు చెలి
ప్రేమ నదే మనుచున్ వచింపకన్.

గీ. అత్త మల్లఁడునప్పు డయ్యంబుజాక్షుఁ
దూరకుండుట సరి పోలకుంట గాదు;

పరవశతచేత నేమియు బదులునేయ
మనసులోఁ దోఁచకుండీనయునికి గాని.

సీ. మొదలఁ బక్కిటికీడె మొసఁగి తాఁ గాదేమొ
మంచి దమ్మనుచు నిప్పించుకొనును
తానె గుబ్బ లంటంబు నాని దోసము ద్రొబ్బ
మంచనికేలఁ బట్టించుకొనును
పలుమోవి నాటి తప్పామొను లెమ్మంచుఁ
గెమ్మోవి మరల నొక్కించుకొనును
పరవశయై మ్రొక్కి మఱచితి నేఁ బెద్ద
నంచని మరల మ్రొక్కించుకొనును
ఒకటి చెలిగోర శౌరి దానొకటి గోర
కొమరుఁ బ్రాయంపుఘనమొల్లఁ గొల్లలాడి
రిద్దఱును దోడుదొంగలై యింక మరుని
కేమి లంచంబు లిత్తురో యెఱుఁగరాదు.

సీ. కనుబొమల్ ముడివెట్టుకొని నీవు నేనంచు
వరుసవెంబడులకై వాదులాడి
యాయతమైన నిల్చి యటు కేల వేడుక
విరుల బంతులతోడ వ్రేటులాడి

యాయముల్ దాఁకి హా యని నొచ్చి రోషాన
  మురళించి గోళ్లచే నఱకులాడి
కెరలి చేపట్లనఁ గ్రిందుమీఁ దయి పోరి
  బిగువుతో సందీక పెనఁగికూడి
బడలి సొక్కుచు సోలుచుఁ బాన్పుమీఁదఁ
బడుచు లేచుచు మరలఁ బైఁబడుచు నుండి
రిద్దఱును గొంత సేపు పెన్నుద్దులగుచుఁ
జిగురువిలుకానిబిరుదుమాట్టి లనంగ.

వ. ఇట్లు పెనంగుచు ననంగసంగారంభంబున కిద్దఱుం జొరక యగరుధూపధూమంబుల గుబులుకొను కమ్మకస్తూరితావులం బొనుగు వడి కొంతవడి చిత్రరూపంబులకై వడిఁ గదల కుండి రంత, నగ్గోపికాకాంతునిం గవయు తమ కంబున నక్కుంబుకంఠి యిట్టట్టుఁ గొట్టుకొఁ డుచు నతఁడు గదిసినఁ గదియనీయక, య వాంతరలజ్జాభరంబున దాఁపురంబులు వెట్టు చు నట్టిట్టు గుట్టునం జిట్టాడి పట్టినం దట్టివెచి యొయ్యనొయ్యనం బయ్యెదకొంగుఁ దిగిచి యుబికినచనుమిట్టల కట్టకేలకుఁ గేలుసాఁచినఁ

బట్టీక చిట్టాడుచుఁ, బట్టువిడుపుల చిట్టకం
బుల్లను వేగిరింపక యేమఱించి లాలించి కౌఁగి
లించినం గృష్ణుండు గడిమి యదుముచు,
నునుటు సిబ్బెంపు టుబ్బుగబ్బిగుబ్బ లురమ్మో
నం గ్రుమ్మి సొమ్మసిల, హా! యని కనుదమ్మో
లం దేలవైచుచు, మోహంపువగలను మో
ము మోముసం జొనుపసచ్చినం దప్పించి యొ
ప్పక యవ్వాల నివ్వాలఁ ద్రిప్పి, యబ్బిన మెడలం
గొబ్బునం జుబ్బనఁ జాఱగా వాత్రెఱఁ గ్రోలిన
నఱగన్ను వైచుచు, బెండుపడి మునింగి విడు
విడుమని విదలించిన బదులుతెమ్మని పెదవి
మొదలానం బోదివి యూని నాలుకచేఁ బైపైఁ
బునుకుచు, చూడకుమని డాకేలఁ గ్రేగన్ను
లు మొగిచి వలకేలఁ జనుముక్కులు పులిమి
బలిమిం దక్కితి వని చురుక్కునం జుక్కతే
ర్పడ నొక్కుచు, మక్కువను గోటి పోటులం
బొక్కిలి నిమిరి, యవ్వాలఁ దడవఁగడంగినఁ
దడంబడుచు, మెడబలిమితనంబున మోహారం
బుగ దేహంబు లాహిరింగొను తెఱంగునకుం
గలఁగి కన్మొగిచి నగుచు, నఖంబులఁ జెక్కిలి
మీటుచు, లెమ్ములెమ్మని కమ్మవిల్తుని కేళికిం

బయికొల్పిన మెలఁకువలం గనకివలు చెవులం
దవులం జొనిపి తనివిదీఱక విడివడక "యొడ
ల్లెం గలయం గరఁగించితి, వేడనేర్చితి? వె
వ్వతెపోఁదఁ బరాకునం బడలితి? వలసితి;
పిదిరా సుఖానందం; బిదిరా వింతచందం" బని
పయ్యెదకొంగునఁ జెమట లెడనెడం దుడు
చుచు, బొమలు ముడుచుచు నన్నుం జూడకు
మని చివుక్కునం బయికొని యంతకంతకుఁ
గంతుకం బాడుకై వడిం దూఁగాడుచు మఱి
యునుం బాతరఁ లాడురీతులం గుల్కుచు,
నల్లనల్లన లకుముకి తెఱంగునం గెరలుచు,
నప్పటప్పటి కాముద్దు లద్దంపునీడలంజూచుచు,
"నిట్లు నేనెద విది యెట్లు మఱతురా" యని
భావవిరహంబు దోఁపఁ గొంతవడి నిశ్చలం
బుగ నుండి, తలయూఁచుచు, రాలుపువ్వులు,
గ్రమ్మ చెమటయు,జాఱుగ్రుమ్మడియు నెఱుం
గక యందందు వింతపిలుపులం బిలుచుచు,
కంతు సాయుజ్యం బందుచందంబునఁ దనువు
లేకీభావంబుగా నంటుకొన వ్రాలుచుఁ బ్రేమా
తిశయంబునం జొక్కుచుఁ, గరంగుచు నమ్మా
ధవుండు రాధికాపుంభావసంభోగశృంగార

క్రీడానందసాగరంబున మునుంగుచుం దేలు
చుండె నంత.

చ. తెల తెలవాఱ వచ్చె నలు
దిక్కులు విచ్చె శుకీపికావళుల్
కలకలఁ గూయఁజొచ్చె మఱికంతుఁడు విల్
రతిచేతి కిచ్చెఁ దేఁ
టుల రొద హెచ్చె జక్కవకు
టుంబము విచ్చె సమీరుఁ డంత శ్రాం
తులకు ముదంబుఁ దెచ్చె మది నొచ్చె
విటీవిటచోరకోటికిన్.

సీ. మినుకుఁజుక్కల గోటి చెనకులేదవి కృష్ణ!
అదిగదా, నీవెఱుంగుదువు రాధ!
సొంపుకన్నుల నిద్రమంపు లేదవి కృష్ణ!
అదిగదా, నీవెఱుంగుదువు రాధ!
కెంపువాతెరఁ బచ్చికెంపు లేదవి కృష్ణ!
అదిగదా, నీవెఱుంగుదువు రాధ!
నునుమేనఁ జిఱుగాజు నొక్కులేదవి కృష్ణ!
అదిగదా నీవెఱుంగుదువు రాధ!

నిన్న మొన్నటివాఁడవు నేఁడుచూడ
నేడనేర్చితి వీమాట లీవు కృష్ణ!
నాకు నాశ్చర్యమైనది నీకుఁ దెల్పఁ
గూడ దదిగదా నీ వెఱుంగుదువు రాధ!

క. అని యొండొరు లిటులాడుచు
దినదినముఁ గలసి యొరులు దెలియకయుండన్
కనుమాటి తిరుగుచుందురు
కనఁబడినన్ వారి బొంకు గావింతురొగిన్.

సీ. తనమోవి పంటికొద్దిని జుఱుక్కన నొక్కఁ
గినుకతో విదళించుకొని పెనంగు
పెనఁగినఁ బోనీక బిగికౌఁగిటఁ గదింప
విడు విడు మనుచు నల్గడలఁ జూచు
చూపు వెంబడి నొకించుక నీవిఁ జేనంట
దుడుకు మానవటంచు వెడలఁ బోవు
పోవుచో నొడిసి హూఁ, పోకుమంచు దమింప
నోడి పిమ్మట జంట నుండ వెఱచు
వెఱచి వెఱవని తెగువచె వెడల మఱచు
మఱచి మఱవని తెలివిచే మగుడఁ దలఁచుఁ

దలఁచితలఁపని తలఁపునఁ దగుఁలుపడుచుఁ
బడుచుఁదనమునఁ దిరుగుఁ బైఁబడుచు రాధ.

ఉ. కూరిమిఁ గొన్నినాళ్లిటులు
గోపసుతుండు చెలంగుచుండి యా
మేర తలంపులోఁ గదుర
మెల్లనె రాధను నిద్రవుచ్చి వా
ర్వారల కెల్లనుం దెలిపి
రాతిరి వేకువజామువేళ న
క్రూరుని వెంబడిన్ మధుర
కుం జని వేడుక నుండె నయ్యెడన్.

వ. అనిన నవ్వలివృత్తాంతంబుఁ జెప్ప మనుటయు:

శా. వీక్షామాత్రఫలప్రద ప్రళయకా
వేరీమహాపట్టణా
ధ్యక్షా, శంకరపద్మనాభ రఘునా
థా మాత్యగోపాలకా
దీక్షేమంకర సోదరాగ్రజప దా
త్మీయాఢ్య, వాఙ్మంజరీ
సాక్షాన్నందకుమారపాదయుగ పూ
జాలబ్ధభాగ్యోదయా!

క. గంధేభగామినీకుచ
గంధాంకితవక్షు భాగ్యకలిత కటాక్షా,
బంధురహయసింధురజయ
బంధురనయకీర్తి, వంశపావనమూర్తీ.

తరల. మధురభాషణ, మంజుభూషణ,
మాన్యసజ్జనపోషణా,
కథితవర్తన, కీర్తినర్తన,
కాంక్షితాచ్యుతకీర్తనా,
ప్రథితలక్షణ, బంధురక్షణ,
భాగ్యదాయకవీక్షణా,
మథితఘోర విపక్షసార వి
మానితస్థిరభాస్కరా!

గద్య. ఇది శ్రీమద్వేణుగోపాల వరప్రసాదలబ్ధ
శృంగారకవిత్వవైభవ వెలిదిండ్ల తిరువేంగ
ళార్యతనూభవ విద్వజ్జనవిధేయ,
వేంకటపతినామధేయ ప్రణీతంబైన
రాధామాధవసంవాదం బను
మహాప్రబంధంబునందుఁ
ప్రథమాశ్వాసము.

శ్రీః

# శృంగార
# రాధామాధవ సంవాదము

ద్వితీయాశ్వాసము

---

శ్రీమత్సమస్త సద్గుణ
ధామా, రామాభిరామ, తాండవకృష్ణ
స్వామిపదాంబుజదాసా,
శ్రీమగదలరామదాస, చిత్రవిలాసా!

గీ. అవధరింపుము జనకధరాధిపతికి
మదిని సంతోష మొదవ సన్మౌనితిలకుఁ
డైన శుకయోగి రోమాంచితాంగుఁ డగుచుఁ
నవలికథయెల్ల నిట్లని యానతిచ్చె.

చ. అమరఁగఁ గార్యఖడ్గముల
యందుఁ బరాకయి రాధికామనో

రమణుఁడు కొన్నినాళ్లు మధు
రాపురిలో విహరించి యంత భ
ద్రముగ సముద్రమధ్యమున
ద్వారకయన్ పురమున్ ఘటించి రా
జ్యమునకు నాథుఁడై సకల
సంపద లందుచు నొప్పె నవ్వరిన్.

క. కులమెల్లను రక్షించెను
దలిదండ్రుల చెఱలువాపి తాఁబోషించెన్
భళి! యిఁకఁ దగదె 'సుపుత్రః
కులదీపక' యనెడుమాట గోవిందునకున్!

ఉ. ఏవగవారు చేరిన స
హించి తనంతటివారిఁ జేయుచున్
దైవము దాత తల్లియును
దండ్రియుఁ దానయి ప్రోవఁగా జగ
త్పావనమూర్తియౌ తనకుఁ
బావనమౌ తనుఁగన్న దేవకీ
దేవినిఁ దన్నుఁగన్న వసు
దేవుని నాపదఁబాపి ప్రోచుటల్.

మ. పదిరెండేండ్లగు ప్రాయమందు నిటు గో
పాలుండు భూపాలుర౯
మెదల౯ మీఱఁగనీక లోఁగొనుచు రు
క్మిణ్యాదులౌ కన్యల౯
పదియాఱ్వేల వివాహమై సగుణరూ
పబ్రహ్మమై కన్నవి
న్నదిగా దీమహిమం బటంచు ఘను లె
న్నంగాఁ జెలంగె న్మహిన్.

క. ఈవగ సమస్తభాగ్యము
కైవసమై నిండియుండఁగా సైఁపక యా
గోవిందుఁడు రాధపయి౯
భావం బిడి కందుఁ గుందుఁ బరవశమొందున్.

క. డాయఁడు వనితలచెంతకు
మూయండొకగడియమాత్రమునుగనుఱెప్పల్
చేయఁడు చక్కఁగ భోజన
మీయఁడు తనమనసు మర్మ మెవ్వారలకున్.

సీ. పెనఁగుచో రుక్మిణి నునువలె నీదుమే
నత్తె లేదనిపల్కు నలసి నవ్వు

కథ చెల్పుమన సత్య గాథ రాదనిపల్క
నదిగాక విననని యసురుసురను
రతివేళఁ గాళింది నుతియించుచును నాథ
రాయనఁ బైవ్రాలు హాయటంచు
మరుమాట దెల్పు జాంబవతినా నీవల్ల
వింట లేదన నీరు కంట నించు
బలిమిఁ బడఁతులు పైఁబ్రక్కఁ బడెడువేళ
నోడువుమాటల వ్యంగ్యముల్ దడఁబడుటలు
చదురులును సంధినేర్పులు వెదకిచూడ
రాధ తలఁపైన మదిఁ గుందు మాధవుండు.

చ. పయికొని పువ్వుఁబోండ్లు బహు
భంగులఁ బ్రార్థన చేసి వేఁడినం
గయికొనఁడాయె శౌరి తనుఁ
గానక రాధిక యెంతయుబ్బసం
బయి పొరలాడునో యనుచు
నాత్మను జింతిలు నట్టివారికిన్
దయ యొకచోట నుండిన వి
తావిత యెంత వివేకముండినన్.

చ. ఒకరికిఁ దెల్పరాదనుచు
    నూరక చింతిలుఁ గొంతసేపు దా
నొకరికిఁ దెల్ప మంచిదని
    యుద్ధవుతోఁ దెలుపంగ బోవు నే
నొకరికిఁ దెల్ప రాధ యిటు
    లొక్కరి కేటికిఁ దెల్ప నంచుఁ దాఁ
దకపికలాడునంచు మదిఁ
    దాలిమి వీడును వేఁడు దైవముః.

వ. ఇవ్విధంబున బహుభంగులంబొగులుచు నెందు
ను బ్రొద్దువోక యద్దేవకీనందనుండు తనప్రాణ
సఖుండగు నుద్ధవుని కైదండఁగొని మందమంద
చరణ్ములయుపవమాన కంపితాభంగభంగనట
త్కలక్వణితరణితకలహంసకారండవ ప్రముఖ
పత్త్రికుల పత్త్రపాతోద్ధూతాంబుజాత జాత
పరాగరాగకషాయితకషాయకాసార రంగ
త్తరంగకణోద్ధూత జలకణ పరంపరాపరితో
షిత మందార మాకంద చందన పిచు
మంద కుంద సిందువార తాల హింతాల
తమాల మాలతీ తక్కోల సాల రసాల జంబూ

జంబీర ఖర్జూర కరవీర సహకార పున్నాగ
నాగవల్లీమల్లికా పుంజరంజిత నికుంజపుంజ
మంజుళ వివిధ కుసుమ భాసుర వాసనాభి
రామంబగు నొక్క కేళికారామంబుఁ జేరి
యందు నింద్రనీల సాంద్ర కుట్టిమప్రాంత
ప్రవాళ స్తంభ సంభూత కాంతి విభ్రాజిత
జాతరూపమయ కుడ్య నిబద్ధ పద్మరాగ చ్ఛవి
చ్ఛన్న మరకతకలాపయుక్త ముక్తావితాన
విలాసవాస చతుష్కికాంగణ కాంత శశికాం
త శిలామయ వేదికాతలంబునఁ గూర్చుండి
కొండొకవడియూరకుండి పలుదిక్కులుం గనుం
గొని యుద్ధవుం డాయ రమ్మని యీమర్మం
బెన్నఁడేనియు నీవు వినియుందువే యని గోవిం
దుండు మందహాస భాసురముఖారవిందుం డై
యి ట్లనియె :

ఉ. ఇద్ధరఁ గల్గు రాజనయ
మెక్కడ లేని ప్రసిద్ధిఁగాంచి నా
బుద్ధికి నీడు లేదనఁగఁ
బొల్పు వహించి తలంప నేమిటన్

బద్ధుఁడుఁగాక యుంటిఁగద
ప్రౌఢతకెల్లను వెల్తిగాఁగ నో
యుద్ధవ, చిన్ననాఁటితగు
లొక్కటిగల్గె జగద్విరుద్ధమై.

క. పడుచుఁదనంబున గొల్లల
పడుచులతో నాఁడు నాఁడు పైనిఁ బ్రక్కన్
బడుచున్ సందుని చెల్లెలిఁ
బడుచున్ గైకొంటి మోహపడుచున్ వేడ్కన్.

గీ. చిన్ననాఁటనుండి ప్రేమ నెందఱతోడఁ
గూడలేదు; కూడి వీడలేదు?
దానిమఱతు ననిన ధైర్యంబురా; దది
రాధ గాదు ధృతివిరోధగాని.

ఉ. తల్లికిఁ దండ్రి కన్నలకుఁ
దమ్ములకున్ దెలుపంగరాని నా
యుల్లముగుట్టు గోప్య మిపు
డుద్ధవ! నీకు వచింతు రాధ కే
నల్లుఁడనంచు రాధ మఱి
యత్త యటంచుఁ బ్రసిద్ధి యుండఁగాఁ

జెల్లుగ మాకు నిద్దఱికిఁ
జేరిక యేగతిఁ గల్గుఁ జెప్పుమా!

చ. గమకముతోడ నొక్కపని
గ్రక్కునఁ జేసినచో రహస్యమై
యమరదు మున్నె కొంతగొఱ
మైనది శౌరి స్వతంత్రవాది; వే
దమును మతంబు శాస్త్రమును
దైవము లేదని లోక మెంచు; లో
కమున వివేకి లేఁడొకఁడు
కాముకధర్మము లూహసేయఁగన్.

ఉ. ఆరును దూఱునుం బడియు
నాచెలి యేమిటి కంటివేని నే
పేరును వారునుంబలెను
వెట్టిదయన్ వలపించలేదు శృం
గారరసప్రభావములు
కన్నియ నా కుపదేశ మీయఁగా
నేరిచినాఁడ దాని విడ
నేర్తునె? నేర్చిన, దైవ మోర్చునే?

గీ. చక్కఁదనమెల్ల రాసిగాఁ జక్కఁద్రోసి
కమ్మకస్తూరి మేదించి కరఁగఁబోసి
చేసినాఁడేమొ పరమేష్ఠి చేతివాసి
చూసి మెచ్చఁడె చెలిని సన్న్యాసియైన.

గీ. భూమి రాములమోములు పోల్కి యనుచుఁ
దామరల నెంతు రే నట్టి తామరలనె
చెలియపాదంబులకు సాటిసేయఁగూడ
దందు రాజకరస్పర్శ మందలేమి.

గీ. కలమగర్భంబులఁ దృణంబులుగాఁగఁ జూచి
పొలుచుకాహళ లూచకపోవు ననినఁ
బాలఁతిజంఘలతో సాటి పోల్ప నగునె
జనులమఱుఁగున దాఁగెడి దొనలనెందు?

గీ. ఆకృతికి రంభయని కదా లోకరూఢి
యెట్టిరంభలునైన నయ్యిందువదన
తొడల సరిపోలవన్న చోఁ గడమ కేమి
యతివ నెంచంగఁ దరమె బ్రహ్మాదులకును?

క. ఉన్నవె సాటువ లెన్నఁగఁ
గన్నియపిఱుఁదంద మింకఁ గొనందంబుల్

మన్నును మిన్నును గలిగిన
యన్నాళ్లకు మఱవవచ్చునా చెలికాఁడా!

క. ధరఁ గవులు పక్షపాతము
గ రచింతు రదేమొకాని గతులకు సరులా
కరులును, గిరులును సరులా
గురుకుచములు? కెఱుఁగ లేరు గుణసామ్యంబుల్.

క. వచియించను రచియించను
బచరించ గణించఁ బంచబాణునితరమా
కచ మేచకచకచకరుచి
కుచలికుచమరీచి లికుచకుచ కే తగుటన్.

గీ. క్రోల బుద్ధిగొల్పు కొమ్మవాపెరత్రోడ
పండియున్న దొండపండు సరియె;
చేరెఁడేసికన్ను లారసి యుసుమంత
తమ్మిరేకు లనఁగ ధర్మమగునె?

క. కోమలిమోమున కాహిమ
ధాముఁడు సరిగాఁడటన్నఁ దామరసమమా
తామర సమమా నప్పుడు
తామరసముగాక తన యథాస్థితి నున్నన్.

క. ఏమైన సఖిశిఖవర్ణన
సేయంగా నొకరివశమె శేషుఁడు రాధన్
పాయక వేణి నెపంబై
వేయేటికిఁ దెలియలేక ప్రేలుచునుండున్.

క. ఆనగుమో మాకనుగవ
యానడు మామోవితీరు నాచనుఁగవని
క్కానడక క్కాతొడ త
క్కానీటును మఱవవచ్చునా చెలికాఁడా!

సీ. అల్లుఁడా! రమ్మని యలరించు నొకవేళ
హొయలుగాఁ గైసేయు నొక్కవేళ
దుడుకుచేసినను బుద్ధులు దెల్పు నొకవేళ
మక్కువ ముద్దిచ్చు నొక్కవేళ
కన్నెలతో నాడ గద్దించు నొకవేళ
నొంటిగాఁ జదివించు నొక్కవేళ
తచ్చనమాటలఁ దర్కించు నొకవేళ
యూరక నవ్వించు నొక్కవేళ
నొక్కవేళను సైగగా మ్రొక్కివేఁడుఁ
నక్కితినటంచుఁ బైఁబడు నొక్కవేళఁ

బెనఁగు నొకవేళ నొకవేళఁ బ్రేమఁ గలియు
నలుఁగు నొకవేళ నొకవేళ నాదరించు.

క. ఆనాతి మనసు మర్మము
లేనెఱుఁగుదు నాదుమర్మ మెఱుఁగును రాధా
మానవతి లోకులెవ్వరుఁ
గానరు మామనసుమర్మకర్మము లరయన్

చ. తన నునుగోటితాఁకులకుఁ
దాళిన నెవ్వతెపైఁ బరాకు నీ
కని యొక కిన్క దెచ్చుకొని
యవ్వలి మోమయి మోడిసేయఁగా
దని విదళించినన్ నయిచ
దాయెనె నేఁడని చిన్నవోవు నెం
తని వచియింతుఁ గంచుపద
నాచెలినెమ్మన మెంచ నుద్ధవా!

చ. సిగ నునుగొళ్ళ దువ్వుచును
జెక్కిలి నొక్కుచు నేమియే నొకా
నొకకథ చాతురిం దెలుప
నూఁకొన కేను బరాకుగాఁ బకా

పక నగి యేలరా వినవు
    పాపఁడ! యింతలో యింతవింత నే
రకమను ముచ్చటల్ మఱవు
    రా వికె రాధిక నెట్లు వాయుదుః?

శా. రారా కృష్ణుఁడ, రాగదోయి వరదా,
    రావయ్య గోపాలకా,
యేరా చుంబన మీగదోయి, యధరం
    బీవయ్య, నీయాగడం
బేరా, కోప మదేలనోయి, యలిగే
    వేమయ్య, మాటాడరా,
'రారా ర', మ్మని పిల్చు; నెట్లు మఱతుః
    రాధావధూటీమణిః?

ఉ. చక్కనిరూపుతోఁ గలికి
    జగ్గున నిల్చినయట్ల నిల్చి తా
నిక్కముగాఁగ నన్నుఁ గరు
    ణించుచుఁ జూచినయట్ల చూచి తాఁ
బక్కున నవ్వినట్ల నగి
    పైకొనఁగా గమకించినట్ల నల్

దిక్కులఁ గానవయ్యెడి మ
దిం దిగులయ్యెడిఁ దెల్పఁబోయినఁన్.

క. ఆకామినియటు నేనిటు
'కాకఃకాకః పికఃపిక' యటన్న విధం
బై కవఁబాయఁగవలసెఁ బ
రాకా, నావంకఁజూడరా, చెలికాఁడా!

గీ. ఇఁక నశక్తునిరీతిని నేఁదపింప
నొకఁడు కరుణింప నున్నాఁడె యుర్విలోన?
మనము వేరువ ప్రేపల్లెదనుకఁబోవ
వలయు నీవును బైనమై నిలువుమనిన.

క. ఇది మంచిదనుచు నుద్ధవుఁ
డెదఁ బొదలుచు మాట నుబ్బనియ్యక యంతన్
బొదలె, నట రుక్మిణీమణి
యుదుటుంబడుచులమెలుంగులొగివినఁబడఁగన్

క. మనమాటలు వినరుగదా
యని కొంకుచుఁ గృష్ణుఁ డుద్ధవా, చూచితివే
యినుఁ డస్తమించువైఖరి
మనలంగని డాగఁబోవు మహిమ చెలంగన్.

క. దిగవిడిచి లోకబాంధవ,
తగవే నీవేగ మనకుఁ దా నిదిమేలా
పగలాయె ననుచుఁ బద్మిని
మొగిచిన కేలనఁగఁ బద్మములు ముకుళించెన్.

చ. పొడుచుట యాదిగా దనుజ
పుంజములం దెగటార్చి యార్చి తా
వడిఁ జరమాగదానవుని
పైబడి నాతపనుండు గ్రుంక వెం
బడిజగమెల్ల నున్ బొదువఁ
బైకొనుచీకటిసోఁకుమూఁకచే
నడరుతుపాకితాటికొడి
యగ్గియనన్ బొడసూపెఁ దారకల్.

క. ముడిగొన్న కటికిచీకటి
కెడచూపక దీపకళిక లిండ్లఁ జెలంగెన్
వడిఁ దేంట్ల నంటనీయక
పొడసూపినఁ గనకముకుళములవగ మిగులన్

వ. అని యివ్విధంబున నవ్వనజనాభుండు గొన్ని
ప్రొద్దుపోకమాట లాడుచుఁ బెండ్లిచవికలోనికిఁ

జని యుద్ధవునిం బనిచి రుక్మిణీకేళికాగృహంబున
కుం బోయి తదనుగుణప్రియభాషణంబుల సం
తోషంబు సేయుచుఁ దనపయనంబునకుఁ దగు
నెపంబు వెదకుచు మనంబున ఘనంబగు పరి
తాపంబునఁ బొరలుచుండె నంత నక్కడ:

క. తను నిదురఁబుచ్చి వేకువ
వనరుహనాభుండు చనిన వార్త చిలుకచే
వెనుకన్ విని యారాధిక
ఘనతరశోకాబ్ధి మునిఁగి కళవళపడుచున్.

సీ. ఒకరిఁ బిల్వఁగఁబోయి యొకరిపేరునఁ బిల్చు
నమ్మచెల్ల! యటంచు హరిఁదలంచు
నొకటిపల్కఁగఁబోయి యొకటి యేమోపల్కు
మోసమాయెనటంచు మోము వంచు
నొకటిఁ జూడఁగఁబోయి యొకటిఁ దప్పకచూచు
తప్పుగా యిదియంచుఁ దనుగణించు
నొకటి సేయఁగఁబోయియొక ప్రయత్నము సేయు
మంచిదాన నటంచు మదిఁదలంచు
మారు నిందించు నదె తోఁచె శౌరియంచు
బయలు గబళించుఁ బలవించుఁ బల్కరించు

నిజము గాదంచుఁ గన్నుల నీరునించుఁ
గలకలను ముంచుఁ గలయించుఁ గలవరించు.

గీ. బయలుపఱపంగఁజాలదు భయముచేత
నిముడుకొని యుండఁజాలదు భ్రమముచేతఁ
గలికి యపు డోదమునఁబడ్డ కరిణికరణిఁ
దొట్రుపడి కొట్టుకాడును ద్రొక్కులాడు.

సీ. మధుకైటభారాతి మధురవాచారీతి
నుండుండి చింతించు నొక్కవేళ
గోపాలకస్వామి రూపుఁ జూడఁగలేమి
నున్నట్లవెదకుఁ దా నొక్కవేళ
హాటకాంబరధారి యదె డాసెనని చేరి
యూరకె బయలాను నొక్కవేళ
పాథోధిశాయిపైఁ బదము పాడఁగఁబోయి
యొంటిగాఁ దలపోయు నొక్కవేళ
దిక్కులేదని విధి దూఱు నొక్కవేళ
మ్రొక్కి దయఁజూడుమని వేఁడు నొక్కవేళ
నోయదూద్వహ! యని చీరు నొక్కవేళఁ
దా మదిఁ గలంగి రాధికాకోమలాంగి.

గీ. మరియు నొకయింత శయ్యపై మఱువులేక
బాధపడి రాధ తడఁబడి బడలి నిల్చి
పిల్చి హాయని తాఁ బ్రలాపించుదొడఁగె
కృష్ణు నటుగూర్చి చెక్కునఁ గేలుచేర్చి.

క. హాకృష్ణ, హాయదూద్వహా,
హా కేశవ, హాముకుంద, హాగోవిందా,
హాకమలనయన, హాహరి
హాకమలాహృదయలోల, హాగోపాలా!

మ. నిను నాదైవముగా మదిం దలఁతు నీ
నిద్దంపునెమ్మేను నీ
గోనబుం జెక్కులు నీసుధాధరము నీ
గోమైననెమ్మోమునుం
గని యుప్పొంగుచు నాతపఃఫలముగాఁ
గైకొందు నేఁ డయ్యయో!
నను నేలా గెడఁబాయఁజాలితివి కృ
ష్ణా, యెంతనిర్మోహివో!

మ. ఒకనాఁ డించుక చూడకున్న నిను నాఁ
డూర్లో నేమేమొ కం

టికి నిస్సారముగాఁగఁ గానఁబడు నా
    డెందంబు నీ వీ జూచినం
దుకె ముల్లోకముఁ దానె యేలుగతి నెం
    తో సంతసంబందు నేఁ
డకటా, యేమియులేక నీవు నను గృ
    ష్ణా, యింతగాఁ జేయుదే!

ఉ. అక్కట, యెన్ని ముచ్చటల
    కాసపడుంటి మనంబులోనఁ దా
నొక్కటి యెంచ దైవ మది
    యొక్కటి యెంచుట సత్యమాయె; నీ
యక్కునఁ జెక్కుఁ జేర్చుకొన
    నైతిని నా కిది మోసమాయె న
న్నిక్కము పాయకుందువని
    ని న్నెద నమ్మితిరా మనోహరా!

చ. కదియక సీమవారివలెఁ
    గన్నులఁజూచిన వేళఁ గొంత సే
పదియిది ప్రొద్దుపోకల వి
    హారము సల్పిన నింతరాదుగా

మొదలనె దూరమొంచవలె
మోసమువచ్చె నీకేమిసేతు నే
మదిమదినుండి యేల నిను
మాలిమిచేసితి జీవితేశ్వరా!

క. ఆసించి నీవుచేసిన
బాసలకే నమ్మియున్న పసిగోల నయో!
దోసమన కింతలో మది
రోసితి వింతటిదయాపరుండవె కృష్ణా!

చ. అని విలపించి నీవు విడ
నాడిన నెవ్వరిగాననంచుఁ గా
మిని మొగమందుఁ జేలయిడి
మెల్లనె యేడ్చెను వెక్కివెక్కి వా
ల్గనుఁగవ వెచ్చనీరు చిఱు
కాలువలై యఱికంటి నిక్కుఁ జ
న్గోనలను జాఱఁగా మెయి గ
గుర్పొడువన్ మది త్రాల్మి వీడఁగన్.

గీ. అంతఁ బెంపుడుచిల్క యయ్యతివఁ జేరి
యక్క! యిది యేమిచేసెద వళుకుదీరి

చెలులు వినిమెద రెందుకే చింతఁ గుంద
వలదు కృష్ణునిపదమాన నిలుపు మనిన.

క. కనువిచ్చి చూచి రాధిక
తను వేఁడెడు చిలుకతోడఁ దానిట్లనియెన్
వినవే చిలుకా! కృష్ణుఁడు
తనునొల్లని వెనుక నాదు తను వేమిటికే?

క. ఇల్లేటికి మగఁడేటికిఁ
దల్లేటికిఁ దండ్రియేల ధనమేటికి నా
యల్లుని రూపముఁ గన్నులు
చల్లనగాఁ జూడఁ గనినఁ జాలదె చిలుకా!

చ. కల్లరిగాఁడు లోనెనరు
గల్గినవాఁ డదిగాక వావి మే
నల్లుఁడు రూపవంతుఁడు మ
హాగుణశాలి యటంచు నమ్మి నా
తల్లిని దండ్రినిన్ మగనిఁ
దమ్ముల నన్నల రోసి తన్ను నే
నుల్లములోన దేవుఁడని
యున్నది కీరమ! నీ వెఱుంగవే?

ఉ. వీథులలోన లేనగవు
    వెన్నెల చల్లఁగఁగాయఁ బూర్ణచం
ద్రోదయమైనరీతిఁ గళ
    లూనినవాని మొగం బెగాదిగ
న్నా దిగులెల్ల దీఱఁ గని
    నాదిగదా ఘనభాగ్య మౌర నా
మీఁదను దేవుఁ డెంత దయ;
    మేలు, భళా! యనుకొందుఁ గిరమా!

గీ. చందురునిజూచి సంతోషమందు లీలఁ
జూచి పొంగుదు హరి నదిచూడలేక
యమ్మలక్కలు మిన్నక యాడుకొందు
రేల కొఱమైతి, నిందుల నేమిగంటి?

చ. చలమున మచ్చుసల్లిన ని
    జాలకునుఁ దయవాఁ డటంచు నే
వలచితిఁ గేతకీ కుసుమ
    వాసనలఁ భ్రమఁ జెంది తేనె లో
వలఁ గలదంచు నాసగొని
    పైఁబడఁ బుప్పొడి రెండు కన్నులం

దోలికఁ దేవలేక నపు
తుమ్మెదతో సరియైతిఁ గిరమా!

చ. మడమడ నుండలేక బతి
మాలిన నామది నందునో; యదే
కొదవలుగాఁగ నాడుకొను
గుంపులనందునో; యింత కోర్చు నా
బ్రదుకును యందునో; వెతలఁ
బాల్పడఁ జేసిన బ్రహ్మ నందునో;
యదియిదియేల నా వలపు
లాఱడిఁ బెట్టిన శౌరినందునో?

ఉ. ఎన్నిటికంచు నే వగతు?
నిప్పుడు నా తలవ్రాఁత యేమి గా
నున్నదొ? యింత అంతుపడ
నోర్చినదానికి నెంత చెందఁగా
నున్నదొ? కాని పోని తగు
లూనిన నామది కేమి సేతుఁ? గా
నున్నది కాకపోవదని
యుందునె? యుండదు నెమ్మనం బికన్.

మ. అనుకోరాదనికాక యోచిలుక! నా
    కా శౌరి యూరెల్ల హా
యనుకాలంబుననే ఫలం బొసఁగి య
    న్యాధీనతం జెంది నేఁ
డనుఁ బ్రార్థించినకొద్దిఁ దా బిగియ నం
    తం జింత నంతంత యిం
తనఁగారాని విరాళిపాలుపడి లో
    నైయుంటి నన్నింటికిన్.

క. నేఁడైన వానియూసల
పోఁడిమి విడనాడి నేనుపాలిసెద నన్నున్
వాఁడి చెడినాఁడు మారుం
డాడ నితని కేల పువ్వుటమ్ములు వింట్లున్.

చ. అనుచు ననంగునిం గుఱిచి
    యంగనలన్ మము నొంపఁగాని పెం
పను గొఱగావు నీయొడలు
    భస్మముగా మగవారిఁ జేరసుం
జెన కఁగలావె లావుగల
    చిల్కగుఱాని బిర్రానఁజేరి

గ్రసన బ్రతుకఁగ గలవు; నిడ
　　గో యుంక నెన్నకు బాధింపకుముల్.

క. దమయంతి కామునింతిని
భ్రమయించినరీతి వట్టిభ్రాంతిని నన్నుం
దమి ముంచకు మరలించకు
కుమిలించకు పువ్వుటమ్ముఁ గుదించిన కెదఁ

గీ. అని యనఁగనఁడె పిత్ర నెన్నఁగనేమి
నేమిరీతిని నెల దోఁచె నింగి నింపు
నిందుఁ బగ సూచుమని మల్లె తీవ్రగాక
కాఁక నను ముంచ జేసని కలికి యనియె.

సీ. పశ్చిమాచలము పైఁబడి మల్లె బ్రతుకుదే
　　లలిఁ జూపు నింద్రజాలంబుగాక
యిలఁ జకోరములు వెన్నెలఁ గ్రోల నగుడదే
　　వగచూపు కరలాఘవంబుగాక
దినదిన మొకవింత తీరుగాఁ దోఁతునే
　　వెడచూపు బహురూపు విధముగాక
రాహువు మ్రింగఁ గోఁజులుపోఁకి వెడలుదే
　　వెస వెడఁజూపు గారడముగాక

నల్లనైయున్న జగమెల్లఁ దెల్లఁజేసి
భ్రమలముంతువె కనుకట్టుబలిమిగాక
కాకయేపాటి నిజరీతి ఘనుఁడవైతి
నేఁడుగాదోరి, నీదారి నీరజారి !

ఉ. ఆనసవింటివాని మది
నల్లుఁడుగా నెఱనమ్మినావు; లో
కానఁ గుమారుఁడున్ జనకు
కైవడి నోఁగద; మేనమామ గం
డాన జనించినాఁడన వి.
నంబడెఁ దండ్రిని మించినాఁడు ద్రో
హానకు నింకనైనను మృ
గాంక, మృగాంకునిఁ జేరు మూరకన్.

క. కాదేని నీదు వెన్నెల
వేదన నామీఁదఁజూపి విను ప్రాణములన్
లేదనిపించుము పంతము;
లేదా, యల్లునికిఁ దోడు లేతెమ్ము వదిన్.

వ. అని యా రాధావధూతిలకంబు చిలుకం
బేర్కొని:

చ. ననవిలుకాఁడు బోయ, నెల
నా కలదాయ, యిదేల వీరి బా
ధను బడఁజాల; జాణవుగ
దా చిలుకా, యొకగాథ లేదుగా
యన "విను సన్నుతాంగి, తెలి
యంగ ననంగ ననంగ నొక్క రా"
జన విని యంతఁ గేలఁ జెవు
ల్మూసముకాయును; నీశ్వరా, యనుఁ.

క. ఇవ్వగల రాధికామణి
నెవ్వగలం బొగులఁ జిలుక నేర్పునఁ బలికెన్
జవ్వని, మాగోపాలుని
నవ్వుచు నేఁ దోడితెత్తు నన్నంపవుగా!

గీ. ఆఱునెలలాయెఁ గృష్ణుఁడం దరిగి యిపుడు
సకియ రాకున్న పిలిచినఁ జాలుఁగాని
భ్రమసెఁ గావునఁ గాక నీపతి మనంబు
కదలకుండునె నీచెంతఁ గంటి నేను.

వ. అనిన విని నవ్వి యవ్విలాసినీతిలకం బిట్లనియె:

చ. వలచినవారు లేరొ; సరి
వారలలో నగుబాటుగాను నా
వలెఁ జరియించిరే; యొకరి
వంతున కేటికిఁ బోవ? ధాత నా
తలనిటు వ్రాయఁగావలెనె
దైవము దూఱఁగ నాయహాన నేఁ
దొలిమెయి నేమినోము లెటు
నోఁచితినో యిది గంటి నిమ్మెయిన్.

ఉ. కంటికి నిద్ర రాదు; చిలు
కా, కలకాలము వేఁగఁజాల నీ
వంటియనుంగుఁ గల్గి తగ
వా మగవారలఁ బాసియుంట; నే
నొంటిగ నుండి నిన్నుప
నోప; నయో, యిటులేలజాగు? నీ
వెంటనె జంటచేసికొన
వే, పదవే వనమాలిపాలికిన్

క. నీకుం గలిగిన ఱెక్కలు
నా కమరకపోయెఁగాక నా కబ్బినచోఁ

బైకెగసి యిందిరారమ
ణీకాంతునిఱొమ్ముమీఁద నిలువనె చిలుకా!

క. పొమ్మనవలె; నన్నియెడఁ
బొమ్మనవలె; నీవు పోయి పురుషోత్తముతో
రమ్మనవలె, దేహము నీ
సొమ్మనవలె, విడువవలదుసు మ్మనవలయున్.

మ. తను భోగింతుఁ, దను న్వరింతు ననుచిం
తం గాదుపో యింక నా
పని నాకేటికి; సిగ్గులేదె? తొలుతన్
బ్రాయిండి యిల్లాలిఁ గా
పునుగాఁజేసి తుదిన్ద్యజించి తిరిగే
పుణ్యాత్ములం జూచినం
తనె చాలున్ ఫల; మీశ్వరేచ్ఛ యెట్లై
నంగాని యామీఁదటన్.

మ. తనపేరుం దనపల్కులుం దనవగల్
తా నాయెడంజేయుమ
న్ననయున్ నెమ్మది నాఁటియున్న దిఁక మా
నంజాలఁ జింతాభరం

బుస డెందంబున కొక్కటఁ విరసమ్ముఁ
బుట్టించిపోఁ గాని ర
మ్మనవే యొల్లని వానికేల యితర
వ్యాపారచాతుర్యముల్?

ఉ. ఇంగితమెల్లనుం దెలియ
నెంతయు జాణవు నీవు; నీవచ
స్సంగతి యేరికిం గలదె?
సన్నుతిగా దిది శౌరి నేను ను
ప్పొంగుచుఁ గూడినప్పటికిఁ
బొల్పుగఁ దోఁచును నిన్ను మెచ్చఁగా
బంగరుచిల్కా, నిన్నిపుడు
పల్కఁగ నేర్తునె బీదపల్కులన్.

సీ. అనుచుఁ దనచేతివ్రాలఁ బద్యములు రెండు
వడిగ లిఖియించి తెక్కలనడుమ నిడుచుఁ
జిల్కా! నేనేమి దెల్ప; నీచిత్త మింకను
దనదుభాగ్యము పోయిర మ్మనుచుఁ బనుప.

క. గగనమున కెగసి మధురా
నగరముఁ గని యచటఁ గమలనాభుఁడు లెమిన్

దగఁ దెలిసి ద్వారకాపురి
డిగి యచ్చటినగరు సొచ్చి డెందం బలరన్

క. తమకమున భోజకన్యయుఁ
గమలాక్షుఁడుఁబడుకయింటఁగవగొనియుండన్
సమయము గాదని యచ్చట
నమరినచిలుకలనుగూడి యాడుచునుండెన్.

వ. అంత;

మ. తళుకుం గెంపులఁ జెక్కడంపుఁబని ని
ద్రాజాళువాకీలుబొ
మ్మలు నల్వంకల నూడిగంపువగగు
మ్మల్ గాఁ బనుల్ సేయఁగాఁ
గులుకుంబచ్చలకోళ్లమంచముపయిన్
గోపాలుఁ డారుక్మిణీ
లలనారత్నముతోడఁ గూడి పొలయ
ల్కన్ హర్మ్యాగం బౌనెడిన్.

మ. చిలుకం జూచి బిరాన లేచి నగుచున్
జేసాఁచి రారమ్మున్నము

ద్దులగారాబుమిటారిచిల్కా యన నెం
    తో వేగఁ బాదాంబుజం
బులపై వ్రాలఁగఁ గేలిపైఁ దిగిచి యిం
    పుల్ గుల్కా ముద్దిచ్చి తె
క్కాలఁ జక్కంబడ దువ్వుచు న్నిజదృఢాం
    కంబందు లాలించుచున్.

క. నందయశోదలు పరమా
నందంబున నున్నవారె? నన్ దలఁచెదరే
యందలి మనవారందఱుఁ?
గొందఱునను దూఱుకొంద్రొ కోకినుక మెయిన్.

గీ. పిన్ననాఁటనుండి నిన్నుఁ బ్రాణంబుగాఁ
బెంచుకొన్న రాధ యించుకంత
తడవు వీడఁజాల దెడబాసివచ్చుటఁ
జింత సేయు; నేమివింత గలదు.

క. అని వనజాయతలోచనుఁ
డనవిని యింతంతగాని యానందముతో
నెన రింత లేక యుండినఁ
జనవగునే యనుచు మదిని సంభ్రమమొప్పన్.

ఉ. ఓ సుగుణాభిరామ! పురు
షోత్తమ! దేవరవా రపూర్వసిం
హాసనపట్టభద్రబిరు
దాంక మహోన్నతులై భవత్పద
న్యాస లసత్కిరీట వసు
ధాధిపకన్యక లూడిగంబు లా
సాసలఁ జేయనుంట గని
నంతకు వింత మజేమికల్గెడిన్.

ఉ. అన్నియు నుద్ధరించెద న
టంచు నటించిన దానికేమి పో
యె న్నెలకొక్కసారి మొగ
మించుకచూపినఁ జాలు నేల యీ
యెన్నికలంచుఁ గొందఱు ని
జేచ్ఛల దూఱుట దక్క నెవ్వరున్
ని న్నొకపాటివాఁడని గ
ణింతురె, ఓయదువంశభూషణా?

వ. అని పలికిన;

క. ఇమ్మాటలు మఱిమఱివిన
ముమ్మరమై తనదుచెవికి ములుకులు గాఁగా
ముమ్మడి నలుమడి కోపము
నెమ్మదిలోఁ బొడమ రుక్మిణీమణి యంతన్.

ఉ. జాఱినకొప్పుతోఁ జెవికి
జాఱినపాపటబొట్టుతో దిగం
జాఱిన పైఁటతో నొరగ
జాఱిననీవియతో నొకింతగా
జాఱినసొమ్ము తో చెమట
జాఱినకస్తురిబొట్టుతో ముడిం
జాఱినపూలతో నొడలు
జగ్గుమన న్వడిలేచి దిగ్గునన్.

గీ. లేచి తనయొద్దిబోంట్లపై లేనికోప
మెంచి గుప్పించి పిలిచి గద్దించుకొనుచు
సైగగాఁ బోవఁ దన కది సైగ గాఁగ
శౌరి ముసిముసినగవుతో నూర్కుండె.

గీ. చిలుకకడఁ జూచి నీకేల చిన్నవోవ?
నెంత లేదిది; నీకుఁ బనేమి; యొకరి

ప్రకృతిఁ గాదని మాన్పంగ నొకరివశమె?
చెలియ యేమనె నవ్వలఁ దెలుపుమనిన.

చ. చెలియ కిఁకేమి యున్నవి వి
శేషము లయ్యెడ నెన్న మాటికిన్?
దెలుపఁగ వేసటయ్యెఁ జెలి
దీనతఁ జూచినఁ గృష్ణ కృష్ణ; యా
పొలఁతుక యేమిభాగ్యములు
బొందెడినో తెలియంగరాదు; వే
డ్కలగనినైన నీదుసము
ఖంబునఁ జెప్పఁగరాదు తద్వ్యథల్.

మ. ఘనయోగీంద్రునిరీతి నేమి వినినన్,
కందోయిఁ దానేమిఁ గ
న్నను, నెమ్మేనున నేమి సోఁకినను గృ
ష్ణా, దేవకీనందనా,
యనిపల్కున్; జెలి ప్రేమ నేమనఁగ నా
హా; మోహా మోహాహోహా, నె
మ్మన మూరార, వికారమందినదిరా
మందారపుష్పాకృతిన్.

క. ఆపడఁతిచేతఁ బెరిఁగిన
పాపంబున నాదుపల్కు ప్రత్యక్షముగా
నోప దయిన నీసేవలు
ప్రాపించుటఁ గొంతకొంత పాటింపఁదగున్.

చ. ఘనకుచపాళి బాళి నినుఁ
గస్తురిచేఁ గొనగోర వ్రాసి యి
య్యనువున నెన్నఁడుందు నక
టా, యనుచున్ దలపోసి పోసి వె
చ్చనికనునీరు పైపయిని
జాఱఁ గరంబుల నాని చేఁ జుఱు
క్కన విదళించి యెంత ఘన
మాయెను జీవమటంచుఁ జింతిలున్.

క. ఇక్కమ్మలోన నేమో
గ్రక్కనఁ దా వ్రాసియొసఁగెఁ గైకొనుఁడనుచున్
జెక్కుల నిమిడిన పత్రిక
ముక్కున నెడలించి శౌరిముంగల నిడియెన్.

[* మక్కువ వెలయఁగ రాధిక
చక్కఁగఁ దన మేను దుర్వి సంభ్రమలీలన్.—అని పా.]

క. పురుషోత్తముఁ డా పత్రిక
నిరుకేల గ్రహించి మొదల నియ్యవటంచున్
మురియుచు నక్కునఁ జేర్చుచుఁ
దఱచుగఁ దలయూఁచి చదివెఁ దా నిట్లనుచున్.

చ. సకలగుణాభిరాముఁడగు
శౌరికి రాధ నమస్కరించి మి
న్నక యొకవిన్నపంబు; నిను
నమ్మిన వన్నియునుం ఫలించె; న
త్తకు మగఁ డల్లుఁడంచును వి
తావిత తేరకుఁ దేర వట్టియా
డిక లివి యేల నాకు నెగ
డెఁ నడి మాన్పుము మేలు నీకగున్.

వ. అని చదువుకొని తద్భావంబులు పలుదెఱం
గులం బరికించి వాత్సల్యంబును, ముగ్ధత
యును, ప్రౌఢతయును వ్యంగ్యంబునుం దోఁప
వింతయుఁ జింతయు దొంతరగా నంతరంగం
బునం గదురఁ గొంతవడి యూరకుండి యవ్వలం
గనుంగొని యందు,

† "నిను మది మఱవను......

నను నెనరుమఱచి కినియకునాపై......

కనికర ముంచర......

యని తలఁచినపుడె యెనసెద ననరా......"

† ఇది గుప్త చతుష్పాద కందము.

అను వాక్యంబులు చదువుకొని యివి గణబద్ధం బులయ్యును బద్యంబు గానివిధం బేమియని యూహించి యన్నామంబు ముందు వెనుకల రచియించి పరిత్యాగలోభంబున మన్నామం బులు వ్రాయక మనంబునఁ దలంచుకొననుంచు కొనియెనని తానె ప్రాసఁగించి యవియే నాలు గువిధంబుల నిట్లనుచుఁ జదివె.

క. కృష్ణా, నినుమది మఱవను
కృష్ణా, నను నెనరుమఱచి కినియకు నాపై
కృష్ణా, కనికరముంచర
కృష్ణా, యని తలచినపుడె యెనసెద ననరా!

క. కృష్ణా, కనికరముంచర
కృష్ణా, యని తలఁచినపుడె యెనసెద ననరా

కృష్ణా, నిను మదిమఱవను
కృష్ణా, నను నెనరు మఱచి కినియకు నాపై!

క. నిను మదిమఱవనుఁ గృష్ణా!
నను నెనరుమఱచి కినియకు నాపైఁ గృష్ణా!
కనికర ముంచర కృష్ణా
యని తలఁచినపుడె యెనసెద ననరా, కృష్ణా!

క. కనికర ముంచర కృష్ణా,
యని తలఁచినపుడె యెనసెద ననరా కృష్ణా,
నిను మదిమఱవను కృష్ణా
నను నెనరు మఱచి కినియకు నాపైఁ గృష్ణా.

క. అని రచనఁబొగడి కృష్ణుఁడు
మనమున సంతోషమంది మక్కువఁ జిలుకన్
కనుఁగొని గ్రక్కునఁ జను మిఁక
ననువుగ నే తెపెవత్తు నని తెల్పవలెన్.

గీ. మొదలఁ బదివేలనేరముల్ మోచియున్న
నేను నేఁడింక నేమన్న నిక్కమగునె?
రాధతోఁ దెల్పు మొకమాట 'రమణి తెపె
నీదుపదమాన వచ్చెద, నిజ;' మటంచు.

క. అని మారుకమ్మ యొసఁగిన
వినయంబునఁ గొని శుకంబు వినువీథి వడిన్
జనుదెంచెను వ్రేపల్లెకు
మునుపటి తనపక్షపాతమును గనుపింపన్.

గీ. వచ్చుచిలుకఁ జూచి వనిత దిగ్గన లేచి
చార సాచి తిగిచి గారవించి
పోయినట్టిపనులు కాయొ పండోయన్న
పండు పండు తేపు పండుగనిన.

క. ఇంత మొగ మంత చేసుక
యంతింతనరాని నిస్తులానందముతోఁ
గొంతవడి యూరకుండి త
నంతనె రాచిల్కఁ జూచి యంగన పల్కెన్.

ఉ. కంటివె కన్నులార నవ
కంతునిరూపము; వీనులారఁగా
వింటివె వానిమాట; లొక
వెంబడినైన నన్నుఁ దలంచెనే?
అంటివె కృష్ణకృష్ణ యని
హాశుకమా, పొడగంటి వీవు మాం

వంటి యదృష్టహీనలకు
వానిఁ గనుంగొనుభాగ్య మబ్బునే?

క. ఉన్నాఁడా గోపాలుఁడు?
విన్నాఁడా నీమమాట? వేడుక వచ్చె
నన్నాఁడా నీతోడను?
మన్నాఁడా యేడనైన మక్కువతోడన్?

ఉ. ఏమనె, నేమిపల్కె, నిను
నేమనిపంపెను, నన్ను దూరెనో,
రామనెనో, పరాకిడెనొ,
రాజులమేలిక కృష్ణమూర్తి నా
స్వామి ముకుందుఁ డచ్యుతుఁడు
వారిజనాభుఁడు శేషశాయి న
న్నేమనె, నేమిచెప్పమనె,
నేమని పంపెను, నిన్ను నేమనెన్?

క. అడియుండె నేను బంపిన
పదపద్యము లెల్లఁ జదివి భావముఁగనెనా
బదులేమి పంపెఁ డెమ్మని [చున్.
పొదలుచు నాలేఖఁ గొనుచుఁ బొలఁతుక నగు

క. పత్రికల వ్రాయుజాణకుఁ
బత్రికలఁ వ్రాయుటేమి ప్రౌఢిమ యనుచుఁ
బత్రికఁ జనుగవపై నిడి
పత్రార్థము సొమ్ము దెమ్ము పత్రిక యనుచుఁ.

గీ. చిలుకతోడఁగొంత సేపు మాటాడుచు
మొదలుకొనిన చోటె మొదలుగాఁగ
నాల్గుచరణములును నాలుగు విధములై
తనరు పద్య మిట్టు లనుచుఁ జదివె.

క. తలఁచినఁ గలసెద రాధా!
తలపడు మరుశరములకును దలఁకకు రాధా!
నెల నీకఁ దలఁపకు రాధా!
కలచిలుకల పలుకులకును గలఁగకు రాధా!

వ. అని యిట్లు చదువుకొని తచ్చాతుర్యంబునకు
మెచ్చుచు నీపాటికటాక్షంబు నాపై నున్నదే
యశోదాగర్భరత్నాకర రాకాసుధాకరునకని
తనపెంపుడుచిలుకను ప్రియంబుదొలుక దువ్వు
చు నీవల్ల నుల్లంబీపాటి చల్లఁదనంబునఁ నుల్ల
సిల్లెశుకకులరత్నాకర రాకాసుధాకరా, ద్వార

కాపురం బేకరణీనుండె; నందలి వింత లేచందం బునీనుండె; నందు గోవిందుం డేయందంబునఁ గొలువైయుండె; నంతయుఁ దెలియఁబలుక వలయు ననిన రాధికావధూతిలకంబునకు ముద్దుచిలుక యిట్లనియె:

సీ. అష్టదిక్పరి చుంబితా భ్రంకషవిచిత్ర
గోపురం బలద్వారకాపురంబు
మహిపదాంభోజాతమణిమయమహనీయ
నూపురం బలద్వారకాపురంబు
సకలవైభవభోగ సరణీవరాజిత
గోపురం బలద్వారకాపురంబు
కమలాంబకునిఁ గన్నకమలాలయకు నుండఁ
గాపురం బలద్వారకాపురంబు
నీల పద్మ మహాపద్మ నిరుపమాన
విజయ కర శంఖ వరకుంద వినుత మకర
కచ్ఛపముకుంద శోభిత ఘనలసదల
కాపురంబగు నల ద్వారకాపురంబు.

చ. పురవరసౌధవాటముల
  జోటులపాటలఁ జంద్రకాంతముల్
గరఁగి ప్రవాహముల్ దివి ము
  ఖంబునరా వినువాఁక యంచుఁ ద
త్తరమున వేఁకువన్ సురవి
  తానము డాసి కడంగి క్రుంకుచో
"హరిరో హరీ"యటంచుఁ బరి
  హాసము సేయుదు రవ్విలాసినుల్.

చ. అలరెడి వీటివజ్రమయ
  హర్మ్యరుచుల్ దివిఁ గప్పఁ బల్కుతో
య్యలిఁ గనుఁగొంటినంచు నవు
  డానరవాహన పుత్రు వేశ్యకున్
జెలఁగఁగ వేలుపుందపసి
  చేయు నమస్కృతి మాటిమాటికిన్; క
క్కలికియు నేను గా ననును,
  గాంతుఁడు విన్నను నేగి పొమ్మనున్

చ. పుడమిజనంబు లీ యినునిఁ
  బూర్వగిరిం దగి పశ్చిమాద్రిపైఁ

బడునని యాడుకొందు రది
పట్టిరు ద్వారకలోనివార లె
క్కడిమతమంచుఁ, దూరుపుట
గడ్డను దోఁచుచుఁ గోటయెక్కి యా
పడుమటగడ్డ వ్రాలు నొక
బాలునిగాఁ గనుగొందు రయ్యెడన్.

గీ. మేటినాకంబె యుంగును గోటపొడ వ
గడ్డఁ గలలోఁతు నాగలోకంబె యుంగు
దీనిలోఁ దారతమ్యంబు దెలియరాదు
దానఁ బ్రథమతృతీయ భేదములు దక్క.

సీ. ఆచారవంతులౌ నచటివిప్రోత్తముల్
వావిదప్పినబహ్మ వార్త నగుదు
రపజయం బెఱుఁగని యచటి రాచకొమాళ్లు
రణమున వెనుకయౌ రాము నగుదు
రందఱేఁ బోషించు నచటి కోమటు లాది
భిక్షుకున్ రోయు కుబేరు నగుదు
రధికధాన్య సమృద్ధి నచటి శూద్రులు తన
హాలము వ్యర్థమటంచు బలుని నగుదు

రచటి తేరులు మేరువునైన నవ్వు
నచటి గజములు శక్రుని గజము నవ్వు
నచటి హయములు పవమానునైన నవ్వు
నచటి భటకోటి నిప్పులనైన నవ్వు.

చ. ఘలుఘలు ఘల్లుఘల్లు ఘలు
ఘల్లనుగంటల చాలుకాలిపొఁ
గోలుసుల మందపున్నడలు
కుల్కులహుంకరణంబు లొరచూ
పులవిడఁబాటు లారజపుఁ
బూనిక లానికలుఁ మదోద్ధతుల్
దలఁపఁగ గంధసింధురము
లాయనఁ బొల్తురు వారకామినుల్.

క. వడి గలిగి మృదుపదంబుల
నడవడిచే మిగిలి యానన్ సాదుల కె
క్కుడు వగఁ జొప్పగుఁ దగునడ
గడునలవడఁ దురగవితతి గవిత[గరిత]లనంగన్.

ఉ. అంగననీవు పువ్వులుఁగ
లాపెవె; యా, మగవారు లేరు; లే

కంగడిదేరినావె వళు
    కా; వెలకుం గొనుమోవి తేనె బం
తిం గొనకుండ దాఁతు వది
    తేరకుఁజూపుదురా విటుండ, కొ
న్నంగడి మారుబేరము లె
    యంచు వచింతురు పుష్పలావికల్.

గీ. అట్టిపట్టణమెల్ల నేకాధిపత్య
ముగ భరించుచున్నాఁడు నీమగఁడు నేఁడు
రేపె పట్టపుదేవి గానోపు దీవు
మమ్ము నేరీతిఁ బ్రోతువో మఱపు లేక.

ఉ. నీడలఁబారుమేడల న
    నేకము చూచితి నాఁడుమేడ లా
మేడలలోన నొక్కమగ
    మేడ భవత్పతికొల్వుమేడ యా
మేడకుఁ దూర్పుప్రక్క నొక
    మేడ వెలంగఁగ శౌరిఁజూచి యి
మ్మేడకు నెవ్వ రాఢ్యులన
    మీపువుఁబోఁడనిపల్కె నవ్వుచున్.

గీ. మగువ మగరాలచవికె నీమగండు నేను
నీప్రసంగములాడ నానీడపార
నచట నొకచిల్క నను జూచి నట్టులుండ,
నవల నెవరన, నెవరు లేదనియె శౌరి.

చ. ఇటు నను బంపినన్ మొదట
నే నటుపోయినత్రోవ దప్పి చీ
కటి నడిమిద్దెటిండ్లఁబడి
కాంతమణుల్ బయలంచు భ్రాంతిచే
నట నెగఁబ్రాకి తాకి తడ
వాడుచు గోడులవెంట దూరి యె
ప్పటి హరిముంగలంబడి కృ
పన్ గడవెళ్లితిఁ ద్రోవ చూపఁగన్.

మ. ఒకకేళీగోపురమందు వింత గనుగో
నూహించి యాపైన నిం
చుక కాలూనిన గిఱ్ఱునం దిరుగ న
చ్చోఁ బోవరాదంచు బు
ద్ధికిఁ దోఁచెన్ మరియొక్కవింత విను మా
తీరంబునం దొక్కబా

మ్మ కరంబెత్త నిజాలకుఁ బడఁతిగా
మ్లాడుచు న్నవ్వితిఁ

ఉ. గోలతనంపుఁజిల్క యని
కోమలి నవ్వకు నీవు ముందుగా
చేలవు గాకతప్ప దొక
పెద్దహజారముఁ గన్న వీఁడు గో
పాలుఁడు వీఁడు కృష్ణుఁడను
భ్రాంతిని జిత్తరువాఁమ్మలెల్లనా
పోలిక నున్నఁ బైఁబడఁగఁ
బోవవెఁ దాళుము రేపె చూచెదఁ.

క. సైచుమనిపలుక రాధిక
యోచిలుకా యింత యేల యుడికించెదవే
నీచిత్తము నాభాగ్యం
బాచతురుం డెపుడువచ్చు నని పలుకునెడఁ.

గీ. కొంద రాభీరపూర్ణ రాకేందుముఖులు
నగుచు నేమకు, విన్నవైనావు నీవు
మాటలేమన మరియేటిమాటలనుచు
నొకటిపైఁబెట్టు నిదె మాటకొకటియుండ.

వ. అనిన నవ్వాలివృత్తాంతంబు చెప్పుమనుటయు.

ఉ. సింధుగభీర, శీతకర
 శేఖరజూటనటద్వియన్నదీ
బంధురశీకరప్రకర
 భాసురసత్కవితాధురంధరా,
సింధురగామినీనఖర
 చిత్రవిభూషణభూషితోజ్జ్వల
త్కంధర, నీతినూతనయు
 గంధర, బంధుమయూరకంధరా!

క. ఖరనఖరశిఖరముఖరిత
వరరవవీణాప్రవీణ, వాణీరమణీ
శ్వరనారదహారపారద
శరకీర్తివిహార, కృష్ణసచివకుమారా!

మాలినీవృత్తము:

సులభనవమనోజా, సూర్యసంకాశతేజా,
ఫలితహరిసుపూజా, బంధుమందారభూజా,
కలితసుకవిభోజా, కాంతసత్కాంతిరాజా,
లలితహితసమాజా, లక్ష్మమాంబాతనూజా!

గద్య. ఇది శ్రీమద్వేణుగోపాల వరప్రసాదలబ్ధ
శృంగారకవిత్వవైభవ వెలిదిండ్ల తిరు
వేంగళార్యతనూభవ విద్వజ్జనవిధేయ
వేంకటపతినామధేయ ప్రణీతంబైన
రాధామాధవసంవాదం బను
మహాప్రబంధంబునందు
ద్వితీయాశ్వాసము.

---

శ్రీః

# శృంగార

# రాధామాధవ సంవాదము

తృతీయాశ్వాసము

---

శ్రీ కరవరవైభవని
 త్యా, కమలానాథమృదుపదాంబుజభృత్యా,
ఆకారవిజితనాస
త్యా, కృష్ణాపత్య, రామదాసామాత్యా!

గీ. అవధరింపుము జనకధరాధిపతికి
మదిని సంతోష మొదవ సన్మౌనితిలకుఁ
డైన శుకయోగి రోమాంచితాంగుఁ డగుచు
నవలి కథయెల్ల నిట్లని యానతిచ్చె.

ఉ. అప్పుడు కృష్ణదేవుఁడు ద
 యాంబుధి గావునఁ గావుమన్నచో

గుష్మన నా గజేంద్రుకడ
కుం జనుదెంచినరీతి వచ్చెం దా
నెప్పటి గొల్లపల్లెకుఁ గ
పీంద్రులు గాయకులుఁ సఖుల్ భటుల్
తప్పక వెంటరా రథము
దారుకు డింగిత మెంచి తోలఁ గన్.

గీ. మునుపు దానున్న రీతులు మొదటి నడత
లక్కడక్కడ సఖులతో నాడుకొనుచుఁ
గనుచు నట గొల్ల లెవ్వరో యనుచు భ్రమయ
నడచి కృష్ణుండు నందుని నగరుచేరి.

క. బడలితిరి మీర; లిప్పుడు
విడిదింట్లకుఁ బొండు;మిమ్ము వెనుకఁబిలిచెదన్;
దడసితిరి భోజనానికిఁ
దడయక నేదలను దేరఁదగు మీరు వడిన్.

చ. అనిపలుకుల్ వినంబడిన
నంతఁ బడంతులు చే నదల్చుచుం
గనుబొమ నిక్క నంబరముఁ
గన్గొనుచుం జెవి వ్రాల్చి కొంత సే

పున కిది శౌరిషల్కుబడి
ఫో వినఁగ గ్గైనె యంచుఁ దత్తరం
బును దమకంబుఁ దాల్మి భయ
మ్ముణ్ ముదమ్ముణ్ మదిలోఁ బెనంగఁగణ్.

క. బిరబిరను సెజ్జమీఁదికి
నరిగి గవాక్షములఁ జూచి హరి యానుచుం
బరికింప రాధికామణి
మఱియేమియుఁదోఁపక పుడుమ్రాన్పడియుండెణ్.

వ. అంత;

సీ. వచ్చెనా మాతండ్రి వాసుదేవుం డని
నందుండు వచ్చె నానందమునను
నాచిన్నిపాపనిఁ జూచితినా యని
సొంపునఁజేరె యశోద ప్రేమ
మన నేస్తకాఁడు వచ్చెనటంచుగోపాలు
గుమిగూడి మూఁగిరి గొల్లెల్ల
నేఁడైన దయగల్గెనే యంచుగోపిక
ల్పొరుగిండ్లనుండి చూచిరి కడంగి

చెలఁగి కృష్ణుండు దుష్పటి మొల బిగించి
తల్లిదండ్రుల పాదపద్మముల కెరఁగె
వారు దీవించి కౌఁగిట గారవించి
రపుడు వారల భాగ్యమెంతని నుతింప.

ఉ. నందకుమారు డంతఁ జిఱు
నవ్వుమొగంబునఁ దేటకన్నులన్
బొందుగజాఱు పూలసిగ
సొంకమునన్ వల పచ్చళించు మై
గందపుఁబూఁతచే నలుపు
గప్పడ కొక్కవిలాసమూర్తి విం
తందము మించినట్లు కన
నయ్యె నెగాదిగఁ జూచువారికిన్.

మ. అచటం జల్లఁగఁ దల్లిదండ్రులమనం
బానందముం జెందఁ బ
ల్కుచు గోపాలుర బుజ్జగించి నలు ది
క్కుల్ సూచి తన్ జేరఁ గో
రుచునున్నట్టి వ్రజాంగనామణుల కో
ర్కుల్ చూపులన్ బ్రీతిఁ జొ

న్నుచు వారావ్వారల నింట్ల కంపి చనెఁ గ్రు
ష్ణుం డా నగర్లోనికిన్.

గీ. చని యనుంగులతోడ భోజనము సేసి
తల్లిదండ్రులతోఁ గొంత తడవు దాను
బెండ్లియాడిన ముచ్చటల్ ప్రేమ నుడివి
వారియనుమతి నిద్రింపవలయు ననుచు.

ఉ. ఇంపు ఘటింప నొక్కపడు
కిల్లు గనుంగొని యందు రాధ యం
దంపు తెలుంగు పీనుల వి
నంబడఁ దా విననట్లుచేరి నున్
గొంపుల చెక్కడంపుఁబని
గీల్కొను బంగరుపావలెక్కి ని
ద్దంపు మెఱుంగుఁ జాయ జము
దాళి కరంబునఁ దల్పుమీటినన్.

గీ. అమ్మ నేఁ జెల్ల యిదిమెవ్వ రనఁగ రాధ
యెటకుఁ బోవకు మిం దెవ్వఁ డేలవచ్చు
నేను నీయల్లుఁడ నటంచు నెనరు దోఁపఁ
బాదములమీఁద వ్రాలె గోపాలమూర్తి.

౧ క. లేవయ్యా, దొడ్డవాఁడవు
నీవని తా నవలి కేఁగి ని న్నేమనుచుం
దీవింప? విందు మును పే
గోవిందుఁడు నిత్యపెండ్లికొడు కనుమాటల్.

గీ. పాన్పుమీఁదను గూర్చుండి పలుకవయ్య,
మీరలును మహారాజు లైనారు గాన
నే నమస్కృతి సేసెద నిదిగో యనుచు
మ్రొక్కి తాఁ బాన్పుదిగువ నింపున వసించి.

క. వెఱఁగుపడి యూరకుండెడు
హరిఁగూరిచి రాధ పలికె నానాఁటివలెన్
మురిపము గలదో లేదో
యరయుదమనివచ్చినావొ?యరయమురాధన్.

ఉ. ఊరక యేమియుం బలుక
కుండెద నంచు దిటాన నున్న, శృం
గారగుణావతంస, నినుఁ
గన్గొని యూరకయుండ నేర దీ
నో; రొకపెండ్లికైననున
నుం బిలిపించితే? చూడ నెవ్వరున్

లేరని కాదు; నీ కెపుడు
నేదయ దానసుగాన, వేడితిఁ

క. గోపాలక మాటాడక
కోపంబున నుండ నెంచుకొంటిని మొదలన్
నాపగ్గె చెల్లఁబోదని
కోపము నేనే శమించుకొంటిని బిదపన్.

ఉ. వేడుకకత్తెనంచు రతి
వింతల నిన్ భ్రమియింపఁ జూతునో,
మోడి వహింతునో భువన
మోహిని నేనని, కాక యేల పెం
డ్లాడితివంచు బాధ్యతను
నాడుదునో, యిదియేమి? యెందునుం
గూడనిదాననై చనవు
గోరెద, నెవ్వతె నంచు దూరెదన్.

ఉ. మానుష మెంచియైన, నొక
మంచితనానకునైన నీదుపు
ణ్యానికి మాటలాడెదవు;
నాతరమా నినుబల్కఁజేసి నే

స్తానకుఁ బిల్వ? నీఘనత
చాలదె రాధకుఁ; గాక కాఁకచే
నే నొకటాడ నేఁటి; కది
నీకు ససహ్యాము దోఁచ నేటికిన్?

ఉ. దోసము కృష్ణ కృష్ణ! నిను
దూఱిన; నానొసలందు ధాత మున్
వ్రాసిన వ్రాఁతఁ గాదనుచు
వ్రాయఁగ నీతరహూనె! నీవు దా
వేసట లేక యేరికని
వేడుకచేసెదు పైనిపైని నా
సాసల మాకు మేమె పయి
నాడిన నిన్నన నేర మున్నదే?

చ. ఎడనెడఁ జూడు మంటివో, ప
యిబయి నెమ్మది నిల్పుమంటివో,
గడెగడె కోరుమంటివో, వ
గం బడుమంటివో, వేఁగు మంటివో
బడలు మటంటివో, యరుచి
పాల్పడుమంటివో, యెగ్గు సిగ్గులే

కడలుమటంటినో, పొరలు
మంటివో, మూర్ఛ మునుంగు మంటివో?

ఉ. ఒక్కతె భ్రాంతిచేఁ బొరల
నొక్కఁడు మాన్పఁగఁ బూఁటకాఁపె? నే
నెక్కడిదాన; నీవు మును
పెక్కడివాఁడవు, నాకు నీకునే
మక్కఱయున్న? దైన నొక
రాడెడిపల్కులు నేన పల్కెదం
గ్రుక్కక; ఆయెఁ బోయె నవి
కొన్ని దినాలఋణానుబంధముల్.

మ. మన మానాఁడు మహావినోదములఁ బ్రే
మ ల్మీఱ భోగించుట
ల్వీను మీనాఁటికి నిద్ద ఱొక్కరొకరిన్
వేసారుటల్ వింతలై
కనుపించెన్ రచియింప నేరిచి కవు
ల్కల్పింప లోకానకున్
విననో; సంతియచాలు, మాఁదికథ లి
వీనుల్ వినన్ లేవిఁకన్.

ఉ. అందుకు బైసిమాలి యొక
యత్నము చేసుకయుంటినేని నా
యందుఁ బదాఱువేల కొక
యంశమురాదు భవత్కటాక్షమా
సందున భోజకన్యకయు,
సత్యయుఁ దృప్తి వహించినంగదా
యింద అమీఁద రాధ యిఁక
నేటికిఁ? జాలదె జీవనానికిన్.

మ. తుది నెట్లయ్యెదనో; యిదేటికి విర
క్తిన్ రేపు నీరుక్మిణీ
సుదతీరత్నము నీవు వాదుగొనఁ బొం
చున్ చేరి నే నక్కఁడీ
ర్చెదనో యెవ్వరెఱుంగువారు మఱినీ
చిన్నారిపూఁబోండ్ల నే
ర్పొదవంగాఁ గయినేసి పెద్దతనమై
యుండంగ నేఁగందునో?

మ. సతమా పొత్తుల వన్నెకాఁడని గణిం
చన్ లేక యాగొల్లగు

బ్రతలన్ బోరితి నేఁటిదాఁక నదిమూ
పెన్ జూడు చేసెన్; నా
గతి నీ పట్టపు రాండ్రకై యొకతె వ
ల్కన్ గారణం బున్నదే?
యతిమాత్రం, బెవ రేమిసేయ నిఁక; మ
ధ్యస్థుండవై తన్నిటన్.

సీ. పాలువెన్నలకుఁ బైఁబడెడునాఁటి కెకదా
యాదరించు యశోదమీఁది ప్రేమ
వేడుకతోడ ముద్దాడునాఁటి కెకదా
మిక్కిలి నందుని మీఁదిప్రేమ
వ్రేపల్లె దూడల మేపునాఁటి కెకదా
మేలమా గొల్లలమీఁదిప్రేమ
అబ్బినయెడల మల్లాడునాఁటి కెకదా
మిక్కిలి మాబోంట్లమీఁదిప్రేమ
తండ్రి వసుదేవుఁడయ్యెను, దల్లి యిపుడు
దేవకీదేవి యయ్యెను దేవరకును,
సఖులు నృపులైరి, రాబోంట్లు సకియలైరి
చాలదే, నేడు క్రొత్తసంసార మయ్యె.

మ. విమలాత్మా, యొకవిన్నపంబు వినుమీ
    ప్రేషల్లెలోనున్న పా
పమునన్ మానితొ నన్ను; నేను మెలఁగే
    పాపాన ప్రేషల్లెపై
మమతల్ మానితొ? యింత మాత్రము పచిం
    పన్ లేవె? పుణ్యంబు నీ
కమరున్ గారణకార్యముల్ దెలిసి యో
    గ్యాయోగ్యము ల్చూచెదన్.

ఉ. యేమిటికంటివేని విను
    మిక్కడివారలు నాఁటనుండి నీ
వేమొ త్యజించి నాకొఱకె
    యీడకు రావని యాడుకొందు; రా
సామి యెఱుంగు నీమనసు
    జన్మము దాల్చుట యాదిగాఁగ నా
నాముఖబాధలం బడితి
    నల్గురికిం బగ యైతి నీవగన్.

చ. నిలువనిప్రేమదోసమున
    నెంజిలి నీరు పచింప; నేరికిన్

దెలుపుదు? నిందుకోసమె యు
    తిత్వర రమ్మని కమ్మ వంపుటల్
పొలుపుగ నేఁటితో మనసు
    లోఁగల త్రొక్కుఁడు లెల్లఁదీఱె ని
ర్మల మిఁక మీఁద నేమయిన
    మంచిదియం చిది సమ్మతించితిన్

మ. ఇల నీమోహపుటాండ్రు నీవు పదివే
    లేండ్లున్ మహారాజులై
కలిమి న్బల్మిని జల్లనై బ్రతుకుఁ డిం
    క న్నన్ను నా పేరునుం
దలఁపంబోకు; తలంప నేమిపని? యా
    దైవంబు నీతోడనే
కలసెన్; బాసలు నీకు మే లొసఁగుఁ బో
    కంజాతపత్రేక్షణా!

శా. దైవం బెంతకుఁ దెచ్చె? నీ వలఁపు లే
    దా నాఁటికి న్నేఁటికిన్
ద్రోవల్ పుట్టెనె? నాఁటి దీగుణమె కా
    దో నాఁటి కిమ్మేను లే

కావో లేక యిదేమి, యీనడత, లీ
   కైలాట, లీమోసముల్?
నీ వాకృష్ణుడ వేను రాధనెకదా
   నీరేజపత్రేక్షణా!

ఉ. ఇన్నిదినంబు లే బ్రతుక
   నెంచుట యేమిటి కంటివేని యీ
కన్ను లదేమొ నిన్నుఁదన
   కాంక్షలు దీరఁగఁ జూడఁగోరె నే
నున్నది దేవుఁడుం దెలియ
   కుండునె; దేవుఁడటంచు నీకు లే
కున్నను మాకుఁ బామరిక
   మున్నది యున్నదినాలలోపలన్.

ఉ. వంచనమాలి గుట్టు మగ
   వానికి నాఁడుది మించియియ్య రా
దంచువచింతు; రౌ, నది య
   థార్థము; ముంగల నిన్ను నొక్క టా
సించినదానఁ గాన నది
   చెప్పకతీరదు; నేనుబడ్డ పా

ళ్లించఁగ రాధ దయ్యము సు
మీ, యిదియేమని చిత్తగించవో!

సీ. ఒంటిగాఁ బవళింప నూరక నాగుండె
యదరంగ నెగవైచినట్లు తోఁచు
వడి లేచి తెగువతో నడవ నుంకించుచో
నదుముచుఁ బైఁబడినట్లు తోఁచు
కాదని యటులేవ గమకించ వడఁకుచు
నదియేమొ కుదియించినట్లు తోఁచు
గోరంత యుబుసుగాఁ గూర్చుండఁ దలఁచుచో
నట్టె సివంబాడునట్లు తోఁచు
వెఱ్ఱిపట్టినఁ గొంత వివేకముండు
జలధిలోఁబడ్డ నొకతెప్ప గలిగియుండు
నింతగా దిక్కు–దెసలేని యిట్టివెతలు
నాతలనె పెట్టవలెనె యాధాత కైన.

మ. అడిగేవారో, మనంబు చల్లఁగను మా
టాడేటివారో, ప్రియం
పడఁగా నూఱటసేయువారో, దయతో
భాషించుచుఁ బుద్ధి దె

ల్పెడివారో, ధృతిలేక యేడ్చుచు మొఱల్
పెట్టంగఁ గన్నీళ్లు దార్
దుడిచేవారో, యొకింత రేఁబగలు నా
తోఁ వేఁగువారో కదుర్?

చ. నలువురు నవ్వఁగా నడవి
నక్క—శివంబయి పోర్లి యంతలో
మెలఁకువ నన్నునే నుపశ
మించుక క్రుళ్ళుచు లోన మించిరన్
దెలివిడి దెచ్చుకొంచు నొక
దిట్టతనాన దినాలు ద్రోసి యి
ట్లలరితి నిన్నుఁజూచితి దు
రాసలు రోసితి మేలు నేసితిన్.

ఉ. ఓర్పున భాగ్య మింతె యని
యూరక నీ పలు కెంతుఁగాక, యా
నేర్పు లిఁకేమి? యల్లుఁడవు
నీవని నేనపు డెత్తి పెంచి యీ
డేర్పను, నేఁడు తాము రమి
యించి మదించన్న, తమ్ముఁ జూచి ని

ట్టూర్పులతో సిటుల్ కరఁగి
యుండఁగ నే నదియేల యింకిటల్.

శా. నామీఁదం దయయుంచుమయ్య యనుచున్
హానంబుతో రాధికా
భామారత్నము చెక్కుకేలనిడి గో
పాలుం గనుంగొంచు వీ
ణామాధుర్యకలస్వనంబు దొలుకం
దానేడ్చె కన్నీళ్ల నున్
గోముంజన్నులు దొప్పఁదోఁగి కడఁకన్
లో వెక్కుచున్ స్రుక్కుచున్.

క. కాంతాళంబున రాధా
కాంతామణి రోదనంబు గావింప రమా
కాంతుఁడు గుణవంతుఁడు నర
కాంతకుఁ డపు డలుకఁదీర్తు నని వడి లేవన్.

క. ముకుఁ జెలమ లదరఁ గోపము
మొకమున కొకవింతదోఁప మ్రొక్కుచు రాధా
ముకురాస్య రాకురా కని
మకరాంకునితండ్రి కనియె మఱిమఱి కినుకన్.

క. ఎనిమిదిరసములఁ గాంతల
నెనమండ్రను బెండ్లియాడి యిఁకనొకకొదవై
పెనుపొందు హాస్యరసమున
నను మచ్చిక సేయ వచ్చినాఁడవె కృష్ణా.

క. నాతోడిది నీకేటికి?
నాతో! డిఁకఁ బలుకరాకు; నాతోడిసఖుల్
నీతికిఁ జాతికి వెలిగాఁ
జూతురు నీతోడిచెలిమిఁ జూచిన నన్నున్.

క. కడనుండి యాడవలసిన
యడియాసల మాటలెల్ల నాడుము, నాపై
నిడవలసిన నేరంబిడు;
గడిదేరితి నాఁటి రాధ గా దిఁక మెలఁగన్.

వ. అని సవతులపయింబాడము పేరీసునంబెరుఁగు
కినుకచేత నొకటి సేయం జేతఁ గాని వితంబున,
లేని కలంకలు మనంబునం దొలంక తొందరపడి
యెందునుండోవగానని కొందలపాటున, వెనుక
ముందఱత్రోపక యన్నియుం జేసి తటస్థునివిధం
బుననున్న సన్నిధానప్రియభావివియోగ ప్రా

పకానల్పకందర్ప హేతిఘాతంబులనిలువునం గ్ర
శించి కలితకంకణనయనయగుచు నప్పటప్ప
టికిఁ దలఁద్రిప్పుచుఁ దప్పక తనుఁజూచునప్పడం
తిఁగటాక్షించియించుక విచారించి యిదియేమ
నియుఁ దలంపక తెగించి యున్నదియొందు నప
నమ్మికలంబడు వారిమనంబు లొడంబడికలం
గాని తేరదని వినయాదరసంభాషణంబుల
షోడశసహస్రరాజకన్యకా మనోహరుం డిట్ల
నియె:

చ. పడఁతిరో నేఁడు నీకుఁగల
పాటివిచారము మాకు లేదె; నీ
యడుగుల వ్రాలి కొంత ప్రియ
మైనఁ దగన్ వివరింతు నన్న-చోఁ
దొడిఁబడ నానఁబెట్టితివి
ద్రోహముఁ జేసిన వాఁడఁగాను నా
చిడిముడియెల్ల విన్నపము
చేసెద తాలిమి నూఁకొనన్ వలెన్.

మ. మును బాల్యంబున నీవు ప్రోవనితతిన్.
మోగంబుతో నునుచో

నను నానావిధగండముల్ బొదువుచు
న్నన్ నీకటాక్షంబుచే
తనె కాదా కడతేరఁ గన్గె నది రా
ధా, నాఁడు బాలెంత యం
చును బంధించును గాలియంచుఁ దరులం
చున్ మాయలం చందుమే.

క. వెనుకన్ దెలిసెను గంసుని
పనుపని యది తెలియలేక బలిమిని బిలువన్
జనవలసె మధుర కవ్వాల
వినకుందువె మామ యచట విడివడినకథల్.

గీ. తల్లిదండ్రులయ్యుఁ దారు గాకుండిరి
చెరలఁ దగిలి వెడలఁ దెరువు లేక
ననుఁ దలంచు దేవకిని వసుదేవుని
నరయవలవె దోషమా లతాంగి!

ఉ. కట్టిఁడిసేఁతలు న్వోతలుఁ
గంసునితోడనె తీరెనంచు నే
గుట్టు వహించి రాజ్యమున
కున్ బరువానక వానితండ్రికిన్

బట్టముఁగట్టి యాకుదురు
పాటవునంతకు నిల్చి యంత ను
న్నట్టులు నిన్నుఁ జూడవలె
నంచుఁ దలంచుక పైన మానెడన్.

మ. సకియా, కంసునిఁ జంపినానని జరా
సంధుండు రోసాన నూ
రక మామీఁదఁ జలంబుతో దిగి యహో
రాత్రంబులుఁ గోటఁ జు
ట్టుక పోరాడు బలంబుతో మరలి పో
టుంబంట్లతో డుల్లి నా
బకళాటానకుఁ గాదె యీనడుమ నేఁ
బార్వారి డాఁగుండితిన్.

క. ఈడకు వచ్చినఁ గాదని
యాడకనుం బోక మనము హాయిగ నెచటేఁ
కూడా నుండుదు మోయని
వేడుకను సముద్రు నడిగి విను.నేర్పుమెయిన్.

గీ. వనధినడుమను ద్వారకయనఁగ నొకటి
పురముఁ గల్పించి.యందుఁ గా పురముగాఁగ

నచటి వారల రప్పించి యిచటి కేను
బైనమై యుంటి నింతలోపలనె వినుము.

శా. వాండ్లున్వీండ్లు నునున్ బడంతి యనుచున్
వాక్రువ్వఁగా వించుఁ దా
విడ్లంబుల్ శిశుపాలుఁ డందుకొని శీ
విన్ బైకొనం దోడి వి
ల్కాండ్లె న్వాని జయించి రుక్మిణి నటుల్
కార్యాభిమానానకై
పెండ్లాడ న్వలసెన్ బయోజముఖి, త
ప్పేనిన్ శమింపందగున్.

చ. ఇవతల నొక్కరాజు తన
యింటను రత్నము పోయెనంచు నా
యవుడెల నిందమోపఁ బరి
హారముగా నొకజాడ వెంబడిన్
దవుల వనాంతరంబునను
దన్నని మెచ్చి పురాణబుతుపుం
గవుఁ డగు రామదాసు తన
కన్యను, రత్నము నిచ్చె బల్మిచేన్.

క. అపు డారత్నముఁ దొలుతటి
నృపునకు నిచ్చినఁ గుమారి నిచ్చె నతండుఙ్
జపలాక్షి, నిందసోఁకిన
యపకీర్తికి వారిఁ బెండ్లియాడఁగవలసెన్.

గీ. కడమవారల నొక్కొక్క కారణముగ
నటు ప్రతిష్ఠకునై పెండ్లి యాడవలసె
నొకటి సేయంగఁబోయిన నొకటివచ్చె
నెదుటివారు వివేకులై యెఱుఁగ వలయు.

మ. చెరలోనం బడువారు లేరొ, దయచే
సేవారలున్ లేరొ; కా
తరలంచు న్విడిపించఁబోయిన నదే
తప్పే పదార్వేలు రా
తెరవ ల్నా మెడఁ జుట్టుకోవలెనె యా
దీనత్వముం జూడకే
మరుమాటాడఁ దెగింతు రేమని వచిం
పఁగ లేక పెండ్లాడితిన్.

క. ఈలాగున నొక్కొక్కతె
చీలలువలెఁ దగులుకొనఁగఁ జేసెను దైవం

జేలా యొడలెఱుఁగని శివ
మేలోకమునందుఁ గలదె యిఁది తగవగునే.

మ. ఇదిగో చేసినపాప మీపలుకులం
    దేమాత్రముం దప్పినన్
బదివేలేల, భవత్పదంబులు దలం
    పన్ యోగ్యుడం గాను సం
పదతోడన్ బలగంబుతోఁ బ్రతిభతో
    భాగ్యంబుతో నున్న నీ
మది కింపౌనని నీ ప్రతిష్ఠయని కొ
    మ్మా, నమ్మితి న్నెమ్మదిన్.

ఉ. ఏ నటుగాక వారలవ
    యిం దయగల్గిన వాఁడనైన నో
మానిని, నిన్ను నింత బతి
    మాలుదు నే సమయంబుఁజూచి యే
మేనియుఁ బల్కుఁ గాని దయ
    నింతటిమోహాము నీకుఁ గల్గినన్
మానక నాదువెంబడిని
    మచ్చికరమ్మిఁక యుక్తు లేటికిన్.

ఉ. అన్నియు విందు నాకుఁ గల
యట్ల పదాఱవపాలు మేలు నీ
కున్నదె? నీకుఁ దాఁ దెలియ
దో? యవివేకపుఁ జేఁత నోరు లే
కున్నది గాన నిన్ బలుక
నోడెద; లోకము వారెఱుంగరే
కన్నులఁ గల్గి నీవు దయ
గల్గుట నే దయగల్గి యుండుటల్.

క. అదియేల? యాఁడుదానికిఁ
గొదవ లిడఁగ రాదు గాన గొదవగు నేనే
యదయుఁడ మహాపరాధిని;
మదవతి, యిఁకనైన మోడి మానఁగరాదే!

మ. అని పల్క న్వినలేక రాధిక సరో
జాక్షు న్నిరీక్షించి క్ర
మ్మినసిట్టూర్పు లడంచి గద్గదిక నే
మే నాడఁగాఁబోయి యే
లని తానే తలయూఁచి యోయి, విను కృ
ష్ణా, జాణవంచుందురే

మునుగల్పించుచు నేఁ డెటెంగితిమి సొం
పుల్ గుల్కు నీపల్కులున్.

క. ఏవిధమున నీమోహపు
దేవులకథ కథలుగాఁగఁ దెలిపెద వోఁగా
నేవినవలెనను ప్రజ్ఞకొ,
నీవేడుకొ కాక! యేమినేరుపు చెపుమా!

క. ని న్నెవ్వ రడిగి రీకథ
లిన్నియు; నిన్నెవరు కోదవ లిటులాడిరి మా
కున్నవి దయలని యెవరను
కున్నా రిటుక్కలేలనోయి, మహాత్మా!

చ. వెడవిలుకానిచేఁ దనువు
వేసరియున్నది యందుమీఁద నీ
యుడుకులమాట లేమిటికి
నూరక యాడెదు నేర్తునంచు ముక్
బిడుగునఁ బడ్డవారిఁ గొర
వింగొని చూఁడుదురే వితావితల్
విడువిడు చాలు నెంతయవి
వేకము నేఁ డిటులయ్యె వేడుకల్.

గీ. మమ్ము హాస్యంబు చేయుట మాన వేని
నాడవలసినయటులెల్ల యాడుమిప్పు
నేను విని తాళలేనని హీనమునను
జెవుల నంగుళములు చొన్పి శిరము వంప.

చ. ఇది కదియంగవేళ యని
కృష్ణుఁడు పానుపు డిగ్గి రాధికా
మదవతిచెంతఁ జేరి నును
మై పులకించి చెమర్ప నొక్క కే
లుదుటునఁ దీసి కన్నుఁ గవ
నొత్తుక యోచెలి, కోపమున్న మం
చిది చలమేల నొక్క చెవి
చే విను నాదొక విన్నపంబనన్.

క. ఒకచెవి మూసుక విన్నప
మొకచెవి వినుమన్న మాట కుల్లముగరఁగ
ముకురాస్య, మాటలాడక
మొకమోరఁగఁ జేసి కొంతమ్నాడ్కి వహించెన్.

ఉ. ఇప్పటి కింతె చాలునని
యేమియునుక బెనఁగాడఁబోక యా

కప్పురగంధితో ననియెఁ
గెంజదళాక్షుఁడు కోపగించి యా
మొప్పులకుప్ప, నీవిటుల
నుందువె యుండిన నుంచు మోమటుం
ద్రిప్పఁగ నేమి చేసితని
దిన్నఁగఁ గన్నులు విచ్చి చూడవే.

క. నీమనసు రాకయుండిన
మోమైనన్ జూపరాదె మోసంబటవే
మామిళ్ళ కాజ్ఞయైతే
కామిని గ్రుక్కిళ్ళ కాజ్ఞ గలదే యెందున్.

ఉ. కోమలి, లోకమందు నొక
కొన్నిదినాలకుఁ గాదె కామినుల్
కాముకులందు నిల్పుదురు
కాంక్షలు పిన్నటనాఁటనుండియున్
గోమున నెత్తి పెంచితివి
కోడిక లుంచితి వాదరించితే
మేమొ యెఱుంగఁ జేసి తిపు
డెవ్వఁడ నింత నిరాకరింపఁగాన్ .

చ. ఎఱుఁగని వాని నన్నుఁ జెలి
మేటికిఁ జేసితి వానఁగొల్పి నీ
సరసము నీవిలాసమును
జాల మనంబున నాఁటె నిన్నిఁక౯
మఱవగఁజాల నేల బతి
మాలఁగఁ జేసెద వేమి పోయె ని
న్నరగడె నేవు కూడినఁ గృ
తార్థుడ నౌదుఁగదే, తలోదరీ!

మ. కలలోనైనను నీవె దైవమని నేఁ
గన్గొందు, నాడెందమున్
దెలియ న్నేర్తువు దైవయత్నమున నెం
తే నేరముల్ చేసిన౯
జులుకంజేతురె బుద్ధిగా నడువు మం
చుం దిద్దుకోరాదటే
చెలి,నీచిత్తము నాదుభాగ్య మిఁక నా
జీవంబు రక్షింపవే.

చ. కనికరముంచవో నెనరు
గల్గినదానవు కావొ, ఛేద మీ

తనువులతోడ రాదనిన
దానవుగావా పడంతి, యింతలో
మనలను జూడలేక నడ
మంత్రపువారు గుబారు చేసి గో
బ్బున నినువంటిదా నికెగ
పోఁతలె నాతలఁ గాకయుండగన్.

చ. చిలుకలకొల్కి, నీసొబగు
చిన్నెల నీనుదేట పల్కులన్
వెలసె మనంబు కాంత, రతి
వేడుకలన్ జవిచూపితేనియున్
పలుకుల కేమి నాతనువు
పావనమాటది మీఁది మాట కు
న్ములుచనగాను నీమనసు
ముచ్చట దీర్చెద నోతలోదరీ!

క. అహమికను నన్నుదూఱిన
తహతహచే నీకు నపుడు దయలేదనుచున్
బహువిధముల నెదురాడితి
నహహా, నాయంత వెతల నందవె నివ్వున్.

ఉ. కంతుని గంతు లెంచి కను
గంటికిఁ బుట్టెడు నీరునించి యా
తంతకుఁ దల్లడించి ధృతి
యల్లలనాడఁగ నిచ్చగించి యా
ద్యంతములుఁ దలంచి చెలు
లాడుకొనన్ దలవాంచి వాంఛచే
నెంత విరాళిఁ బొందితివొ
యెంత కృశించితివో తలోదరీ!

చ. చెలి, నినుఁ బాసియే నిదురఁ
జెందమి తెప్ప లెఱుంగుఁ గాఁకచేఁ
దలఁగుట మే నెఱుంగు రుచి
దప్పుట జిహ్వ యెఱుంగు నోంటినే
నిలుచుట నీవెఱుంగుదువు
నిన్నును నీమదిలోని చింతయున్
దలఁచిన గుండెలో దిగులు
దైవమెఱుంగును ప్రాణనాయికా!

చ. నలువురి మాటలున్ వినక
నాతలిదండ్రుల నమ్మఁ బోక పె

దలు తెలుపంగ నూఁకొనక
దైవమునుం గొలువంగలేక నీ
చెలిమియె భుక్తి ముక్తి యని
చేరితి నింతటి దానవౌట నేఁ
దెలియక మోసపోతి పర
దేశిని జేసితి వంగనామణీ!

క. ఈవగను వగరు వగకును
భావనతో నూఱునాఱుపద్యములు చెలీ!
ఈవఱకును రచియించిరి;
నీవేగతి; లోకమెల్ల నినుఁ గొసియాడున్

ఉ. జిత్తులకత్తె లిచ్చకముఁ
జేయుచుఁ బైపయి నాసఁజేయ నే
నత్తఱి నన్నియు న్మఱచి
యంతటఁ జొచ్చితి బొంకనేల? వా
దత్తిఁక నన్ను నేవగను
దండన చేసినఁ జేయఁజెల్లు నీ
చిత్తము నాదుభాగ్య మిఁకఁ
జెప్పెడిదేమి, కురంగలోచనా!

ఉ. ద్రోహి నటంచు నేఁడుగద
తోఁచెను ముందటి చిన్ననాఁటి నా
మోహముఁ జూచియైన నను
ముందుగఁ గైకొనరాదె, కోపమే
లే హరిణాక్షి, నా నడత
యేగతి నుండిన నుండెఁగాక యీ
దేహము నీ యధీన; మిది
యెంచియుఁ గౌగిటఁ జేర్పరాదటే.

సీ. ననచూపక ఫలించు పనసభూజముభంగి
సుదతిరో, మును మేలు చూపినావు
పూచినంతనె కాచి పొల్చు మామిడిమాడ్కి
నెలఁతరో, మది దయ నిలిపినావు
పూచి పిమ్మట రాలిపోవు పాటలిభంగిఁ
దరుణిరో, కలప్రేమ దాఁచినావు
పూచి కాచి ఫలించు భూకల్పకమురీతి
మగువరో, యిఁకనైన మనుపఁగలవు
నీకు నీయంతఁ దోఁచని నెనరు ప్రేమ
వచన రచనలఁ దెల్పుప నెవ్వారికి వశము?

నిన్నువంటిది ననువంటి నెనరువాని
చలము సేయుట యిది పూర్వ ఫలముగాదె.

క. కలికీ, పలుకవె చిలుకల
కొలికీ, దయఁజూడరాదె, కోపంబేలే?
యలికీరంబుల కిదిగో
యళికెను నాడెంద, మెందు కలయించెదవే!

గీ. ఆనవిడు నీదు పదములనైన వ్రాలి
వేఁడుకొనియెద దయపుట్ట విన్నవించి
పడఁతి, కాదేని హృదయతాపంబు దీఱ
నాన విడువుము నీయధరామృతంబు.

గీ. రమణి, దాసరితప్పు దండమునఁబోవు
నందు రందుకు నోఁచనై తిందువదన!
యింక దయనేలుదో భాగ్యమింతో యనుచుఁ
దొలుతఁ దనుఁ దోడితెచ్చినచిలుకఁ జూచి.

చ. కడకడ యుండడేమె చిలు
కా, మును నమ్మిక లీ వొసంగఁగాఁ
దొడిఁబడి నమ్మి వచ్చితిని
దోఁచినరీతిని విన్నవించితిఁ

గడపట నేమిలేక ననుఁ
గంతునిచేతికి నప్పగించె మీ
పడఁతుక; యాను గాదనుచుఁ
బల్కవు నీవును జేరివచ్చినన్.

క. చిలుకలకొలికికిఁ గలికికి
నలుకట, పలుకదట, చలములట నీపైనన్,
గులుకువగఁగులుకుకపురపుఁ
బలుకులొలుకవలపుఁజిలుకఁబలుకవె చిలుకా!

గీ. మరుఁడుగురిగాఁగ నేనాడు మాటయొకటి
చెవులఁజొరదాయెఁ జిలుక యీ చెలికి నేఁడు
సూఁదిద్రిప్పంగ దారంబు సూటివడునె
భామ యిటులున్న మగవాడికేమిసేయు.

వ. అనిన రాధికావధూతిలకంబు తన పెంపుడు
చిలుకం బేర్కొని యిట్లనియె.

క. నే నెవ్వతెఁ దను మనుపను;
తానెవ్వఁడు నన్ను వేఁడ; తనకును నాకున్
బూనిక నేసంబంధము
వైనంబున నడుగనేరవా యని కదుమన్.

వ. అనినఁ జిలుక యిట్లనియె.

క. నీ వనఁగా నతఁ డనఁగా
నే వినఁగాఁ జాల నెల్ల నీతులు గీతుల్?
నీ వెఱుఁగు దాతఁ డెఱుఁగును
పో వేయనఁగృష్ణుఁడలుక మొగమునఁదొలుకన్.

గీ. ఇంత పనిలేనిపనికి నేనేల పెనఁగ
ననుచు మెడ జారుసిగఁ గేల నదుముకొనుచు
తగటు దుప్పటి వల్లెవాటుగ ఘటించి
లేచి తలయూఁచి రాధను జూచి పలికె.

ఉ. తీరని మోహతాపమున
దీనతచే బతిమాలి చూచి వే
సారితి నింక నీచెలిమి చా
లును నీవెత నీకు ముద్దె; నే
నూరికిఁ బోయెదం గరుణ
యుంచవె; యుంచుక యూఱడించఁగా
నేరకపోతినంచు చెలి
నీవెతలంచెద వింక మీఁదటన్.

చ. సొలయక యెన్ని దేశములు
　　చూచితి, నెందఱితోడ నేస్తముల
సలిపితి, నెంత ముచ్చటకుఁ
　　జాలితి, నెవ్వియు నిల్వవాయె నీ
నిలుకడమాట నీ నెనరు
　　నీరసికత్వముఁ జాల నమ్మితిఁ
జెలి, కలనైన నన్ను మఱ
　　చేవుసుమీ యెవ రెన్ని చెప్పినన్.

చ. కులుకుమిటారి, నీవు నెల
　　కొన్న పురంబును నీగృహంబు నీ
చెలులును నీవు నీసొలపుఁ
　　జెన్నెలు నీవగలున్ మనంబునన్
నెలకొన గుండె జల్లుమను
　　నేఁటికిఁ దీరని పైనమాయె ముం
గల నినుఁ జూడనౌనె! అవుఁ
　　గా పరదేసుల కేడ వేడుకల్?

ఉ. ఒక్కొకనాటి నీనడత
　　లుల్లమునం దల్లపోసి పోసి యే

చిక్కులకైన నోర్చి దరిఁ
జేరుదుఁగా యని చాల నమ్మితిన్
మక్కువ లేనిచోట బతి
మాలిన నామది కందుఁ గాక నా
తక్కువ నేస్తమైన మితి
దప్పిన వేసట గాదె యేరికిన్.

చ. పకపక నవ్వుచుం జెలఁగి
పైకొనుచున్ రతులం బెనంగి పా
యక మన మున్న చంద మిసు
మంతయు నే మఱవంగఁజాల నెం
దుకుఁ బలుమాటలీ తనువు
తో నెఱినమ్మిన నెమ్మనంబుతో
నిఁక నొకకాంతతోఁ జెలిమి
యేమని నేతు సరోరుహాననా!

చ. పలుమరు నీకుఁగాఁ బడిన
పాటులు నీమనసే యెఱుంగు నీ
చలమును నీత్రణీకరము
జవ్వని, నామనసే యెఱుంగు నే

వల ననువంటిమేలుగల
వాని గడించు కొనంగలావె? య
వ్వాల నను దూఱవద్దు, సెల
వా యిఁక నీమకు ముద్దుకోమలీ!

మ. పఱువై వచ్చితిఁగాని నేరములు నా
పై నుంచి కోపించు టే
నెఱుఁగన్నామది చల్లఁ జేసితివి యిం
కిల్లేల? యూరేల? యె
వ్వరు నాకేల? ఋణానుబంధములు గా
వా యన్నియు న్నేఁటితో
సరి గాఁబోలును బోయివచ్చెదఁ గటా
క్షం బుంచుమీ రాధికా!

మ. అనిపల్కి న్విని కల్కియెంతపలు కా
హా యింత గానేరకుం
డిన లో చేతువె రాచకన్నియిల, నం
తేఁజాలు తెల్పెల్ల పా
లనుచు న్నమ్మెదు గొల్లవారికడ; నా
యందూరకే మన్నిటం

గనినా మిన్నియు నీకటాక్షమున నే
కండా ప్రవర్తించుటల్

మ. నను నే నెవ్వతె నంచుఁ జూచితివొ కృ
ష్ణా, నిన్నుఁ బోకుండ బ
ల్మిని బ్రార్థించెద నంచు నెంచితివొ యా
లే యంతకుం జాలవే
యనుఁగుంబోటుల యిండ్లకేఁగెదవొ భా
గ్యం బామెఁ బోపొమ్ము ప్రే
మను నేఁ జూచెద నిన్ను నన్నుఁ దెగడే
మాయూరి పూఁబోఁడులన్.

చ. తెగువల నమ్మలక్కలు ప
తివ్రతలై నను దూఱువారు నే
నొగి విను దాన నీవు కడ
నుండెడివాఁడవె నీవు వారునుం
దగవున మెచ్చఁజేతు రది
దప్పినఁ జూచెద వీటికెల్ల నుం
బాగడిక దెత్తుఁగాదె మెటు
పోయెదు నివ్విధ నెన్ని భంగులన్.

చ. అనుచు బిరాన లేచి వన
జాక్షుని దుప్పటి కొంగుఁబట్టి గొ
బ్బున నెటు పారిపోయెదవు
పోదువుగాకని శయ్యమీఁదికిన్
బెనఁగుచు దియ్య నొయ్యనఁ ద
మిన్ బిగికౌఁగిటిలోఁ గదించి రా
ధనుఁ గరఁగించె శౌరి తను
తాపము దీరఁగఁ గోప మారఁగన్.

చ. చలమును గోప మీరసము
జవ్వని కేడకు డాఁగిపోయెనో
తెలియదు కొంత సేపు తన
దేహము దాఁ దెలియంగ లేక మై
పులకల నప్పటప్పటికిఁ
బొంగుచు నిక్కువ లంట సోలుచున్
బలుకక యూరకుండె నటు
మాధవుకౌఁగిట రాధ వేడ్కతన్.

క. చెలువయట రాధ, కృష్ణుఁడు
చెలువుండట, పిన్ననాఁటి చెలిమట, యెడలై

కలసినవారట వారల
మెలఁకువలకుఁ దమికి మట్టుమేరలు గలవే?

మ. కౌమరుం బ్రాయపుఁ జిన్నిచన్నుఁగవ ము
క్కుల్ నొక్కి కోరాడి కం
ఠమునన్ గేలు గదించి యిక్కువలు గో
టన్ మీటి నెమ్మేన లేఁ
జెమటల్ గ్రాలఁగఁ గౌఁగిలించి బడలిం
చెన్ జొక్కి తా నెంతయున్
దమి రాధా మధురాధరాధరసుధా
ధారల్ చవిం గ్రోలుచున్.

ఉ. చిక్కితివంచు రాధ వగ
చే హరికంఠముఁ గౌఁగిలించి తా
నక్కున వ్రాలి చూడకు మ
టంచును నించుక మోడి సేయుచుం
జక్కెరమోవి యాని నిలఁ
జాలక కన్నరమోడ్చి సోలుచుం
*బుక్కిటి విడెమందుకొని
ముద్దుల నొద్దికమాట లాడుచున్.

*గ్రక్కునగబ్బిగుబ్బలటు గట్టిగఁ బట్టఁగఁ దాళుమంచుఁదాన్.

నిరోష్ఠ్యమత్తేభవృత్తము.—

గిలిగింత న్నగి కాంత కాంతుకృత సం
  కేతజ్ఞయై యిచ్ఛఁ జం
చలతాటంకరథాంగగండయుగయై
  సంత్యక్తచేలాంతయై
చెలరేగెన్ కఠినస్తనార్ద్రినఖని
  శ్శేషాధర గ్రాహయై
గళనాదాంగదఘంటికా కలకలా
  క్రాంతాంగణేచ్ఛా రతిన్.

చ. గళరవ ముప్పతిల్ల బిగి
  కౌఁగిటఁ జన్నులు పిక్కటిల్ల నం
దెలరవ మావహిల్ల గడి
  దేరినవార్తలు గ్రక్కతిల్ల మే
ఖలరొద నివ్వటిల్లఁ దెలి
  కన్గొన లించుక సొమ్మసిల్ల నూ
ర్పులవడి సంఘటిల్లఁ దమిఁ
  బొంగి లతాంగి చెలంగి పైకొనెన్

ఉ. అంత రతాంతమ్మందుఁ గమ
  లాక్షుఁడు రాధికమోముఁ జూచి యా

వింత లి కేమిఁ జెప్ప నొక
వేడుకలోఁ బదివేలువేడ్క లం
తంత ఘటింప నేర్చితి వ
హో, నెఱయోధవు గావె నీవు నీ
వింతకు నేరకున్న బ్రమ
యింతువె కృష్ణుని లోకు లెన్నఁగన్.

ఉ. కోమలి, యెంత నీవు పయి
కొన్నను మున్నొక లేనియెమ్మెతో
నామికచేత నీరతుల
యంద మెఱుంగక యొల్లనంటి నేఁ
డేమని విన్నవింతుఁ దను
వెల్లను బావనమాయె నీబుణం
బేమిటఁ దీర్చుకొందు సాల
యించితి వన్నిట నన్ను వేడుకన్.

క. అన విని రాధిక కృష్ణునిఁ
గనుఁగొని యాసవ్వమోము కళగల చెక్కుల్
నునుమోవియుఁ దెలిగన్నులు
గొనబునఁబలుమారుముద్దుగొనుచున్న గుచన్.

మ. హరిఁజూడన్ బురమెల్ల ఘల్లుమనె నా
హా రాధ మా కేడ దా
పురమై వచ్చెనటంచు రుక్మిణిమొదల్
పూఁబోండ్లు చింతింప నం
దఱిలోనన్ హరి పూర్వపక్షముల సి
ద్ధాంతంబులం జేయ నే
ర్పరి గానన్ సరిమిద్దెలోన నిడెఁ బూ
ర్వస్నేహయూ రాధికన్.

మ. పయిపై రుక్మిణిసత్యభామల రమిం
పంగాఁ బదార్వేలు క
న్నియలం గూడఁగ నిర్వికారుఁడనినన్
నిర్మోహియూ నిర్జితేం
ద్రియుఁ డౌనన్నను దాళియుండె వెనుకన్
నిక్కంబుగా రాధపై
దయవాఁడై యపుడున్న చిన్నెలు వృ
థా తత్త్వంబు లయ్యెం గదున్

ఉ. చేకొని మంతులిలం దిడియె
సీమ విచక్షణ కార్యఖడ్గము

ల్వేకఁ గుమాళ్లయం దిడియె
విద్యలఁ బెద్దతనంబులం గుల
శ్రీకులకంబులం దిడియెఁ
జిన్నెలఁ గేమన రాధతోడిదే
లోకము గాఁగ నుండె నిఁక
లోకులు కాముకుఁడంచు నెంచరే.

చ. కవ విడలేక జక్కవల
కైవడి రాధయు మాధవుం డిటుల్
దవులక యుండఁగాఁ దమరు
తాళక రుక్మిణి సత్యభామ జాం
బవతియు మిత్రవిందయును
భద్ర సుదంత కళిందజాతయుఁ
రవరవ నాడుకొంచు నొక
రాతిరి లక్షణయింటి కేఁగిరఁ.

చ. పడఁతుక మ్రొక్కి వారికి న
పర్యలు సేయుచుఁ దాను వారు నొ
క్కెడ వసియించి నెచ్చెలుల
నెవ్వరి నుండఁగనీక యోచనల్

నడపుచు నీసునం బెగుప
నల్గురు నాలుగుమాట లాడఁగా
నుడుకుచు సత్యభామ విన
యోక్తుల రుక్మిణిఁ జూచి యిట్లనున్

గీ. నన్ను గయ్యాళియందు రీకన్నెలెల్లఁ
దెలియవిను మక్క, పట్టంపు దేవి వీవు
పేర్మి నీతోటి సాటిగాఁ బెనఁగఁజేసె
దానవారాతి పారిజాతంబు కొఱకు.

ఉ. ఎన్నఁటికైన వానిచన
వెవ్వతె నమ్మునె కృష్ణకృష్ణ యా
యున్న దినాలలోన దయ
యుంచినవానివిధానఁ బెద్దరున్
బిన్నరుఁ దోఁచినట్లు నడ
పించును చేసెడి బాసలంటిమా
యెన్నఁదరంబుగాదు నిజ
మించుక లేదు తలంచిచూచినన్.

ఉ. ఇంచుక రాధ సుద్దిమును
పే విని వేఁడితి ఖ్యారుపీరుఁ గ

ల్పించి రటించు నో రదిమి
లేదని బొంకెను నాఁడు నాఁడె యి
ట్లించుక యొద్దికైన మన
మింతకురా నడపింతుమే యిఁకం
గొంచెములోన దానిపయిఁ
గూరిమిదప్పనె తప్పె యోచనల్.

వ. అనిన జాంబవతి సత్యభామ కిట్లనియె:

ఉ. ఎందుకుఁ దప్పె యోచనలు
కృష్ణుని మాయలెఱింగి వానిపై
నింద ఘటింప నేమగును
నేఁ డవుఁ గాదను వారు లేరుగా
కందఱుఁ గారటంచు నిపు
డక్కట రాధిక మేలుగల్గెనా
యందె రమింపఁగావలె న
హర్నిశముం బనియేమి యేరికిన్.

వ. అనిన మిత్రవింద జాంబవతితో నిట్లనియె

ఉ. ఎవ్వరికిం బనేమియని
యేటికిఁబల్కెఁగ నాఁడు నీవు నే

మెవ్వరమంచు నుల్కితి మొ
కించుక నేర్పుల నాటపాటల
న్నవ్వుల లోను జేయవలె
నాథునిఁ గాక మఱేమి; రచ్చలన్
రవ్వలఁ బెట్టినన్ మనసు
రంజిల నేర్చునె యెట్టివారికిన్.

వ. అనిన భద్ర మిత్రవిందతో నిట్లనియె.

ఉ. రచ్చల రవ్వలన్ మనసు
రంజిలదంటివి రాధ కేమిట
న్వచ్చెఁ బ్రతిష్ఠ నేఁడు మగు
వా, మనమందఱ యొక్కమాటగా
కచ్చెగ శౌరితోడఁ బలు
కన్వలె రాధకు మాకుఁ గూడునే
నిచ్చలు మేము గావలెనొ
నీ కది గావలెనో యటం చిఁకన్.

వ. అనిన సుదంత భద్రతో నిట్లనియె.

చ. అదివలె మేముగావలె నొ
యం చిపుడాడిన దాని మానునే

అదివలె మీరుఁ గావలె నటం
చను; నింకొక నేర్పు తెల్పెదన్
పదటము లేక నందఱము
పద్మదళాక్షుని ద్రోవఁ బోక నేఁ
డిదిమొదలున్ తెగించిన వ
హిన్ సమయంబు ఘటింపఁగావలెన్

వ. అనినఁ గాళింది సుదంతతో నిట్లనియె.

చ. సమయము సేయఁ గృష్ణునికి
సాగకపోయిన దేమి యందుచే
నమరగ రాధ కేమికొాద
వయ్యెను బిన్నటనాఁటనుండియున్
దమి తల కెక్కియున్న దయ
దప్పెనె నేర్చితిమేని మందు మం
త్రములను బూని వానికిని
దానికి భేదము సేయఁగాఁ దగున్

వ. అనిన లక్షణ కాళిందితో నిట్లనియె:

ఉ. మందును మంత్రమం చనెదు
మంత్రము లిప్పుడు పాటి దప్పె నీ

యందఱు మెచ్చ నే నొక యు
పాయముఁ దెల్పెద రాధచెంతకే
పొందుగఁ జెప్పి పంపుదము
'బుద్ధిని బెద్దవు నీవు నీకు మా
కెందుకు వాదు నీవె ఘన
మెంచుక దిట్టముసేయు' మంచొగిన్.

వ. అనిన రుక్మిణీరమణీశిరోమణి యక్కామినీ
మణులం గనుంగొని నవ్వుచు నిట్లనియె:

ఉ. నిందలు సేయ నెందుకుఁ దృ
ణీకర మెందుకు వీడనాడఁగా
నెందుకుఁ గాదు కూడదన
నెందుకుఁ బల్కుక మోడి సేయఁగా
నెందుకు మందుమంత్ర మన
నెందుకు దైన్యముఁ బొంది యాడఁగా
నెందుకు నే వచింతు నొక
యిక్కువ యించుక వింటిరేన్నియున్.

మ. మనభోగంబుల నేమి తక్కువలుగా
మన్నించె నేవేళకై

నను మాటాడఁడొ, బుజ్జగింపఁడొ, రతిక్
మేల్లాడుచుం దృప్తిగాఁ
దనువుల్ సౌఖ్యము లొందఁజేయఁడొ మహా
తాత్పర్యచిత్తంబునన్
మనలోనక్ మనవారె యీర్ష్యలు వహిం
పక్ వారివే న్నేరముల్.

సీ. ఒకరిసొమ్మేమి వేఱొక్కరిసొమ్మేమి
చక్కెరకబ్బనే చిక్కఁదనము
లోకులు గననేమి తాగనుంగొననేమి
వెన్నెలపూనునే విన్నదనము
అంత గైకొననేమి యింత గైకొననేమి
యమృతాని కబ్బనే యల్పతనము
చెంత నుంచిననేమి చేత నుంచిననేమి
విరిబంతికబ్బనే వెగటుఁదనము
యొకతె చవిగొన్న లేదె మోవికిని దీపి
నలుగురును జూడ లేదె నవ్వులకుఁ దెలివి
మాట యొకమాటు విన్నఁ జాల్మనకతృప్తి
శౌరికడ నుండినను లేదె సంతసంబు.

మ. వినుఁడే వేళను కృష్ణుఁ డేనగరికిన్
వేంచేసెఁ దా నెవ్వరిం
గనిమాటాడెను వార లప్పటికిఁ బ
ల్కున్ మేర సర్వజ్ఞుఁ డా
ఘనుఁ డేలా పొరపొచ్చెముల్ నడుపు నిం
కన్ మానుఁ డీవార్త లో
య్యన నారాధ యొకింత విన్న మనకే
యాఁ జిన్నపో హీనముల్.

చ. అన నిది యుక్తమంచు నపు
డందఱు సమ్మతిఁ జేసికొంచు మె
ల్లనఁ దమయిండ్ల కేఁగి యొక
లాగున నుండిరి వారిమాట లా
యొనరికఁ బొంచు లుండి విని
యొద్దికఁ బెంపుడుచిల్క గ్రక్కునన్
దనకు వచింప రాధ విని
తా నది కృష్ణునితోడఁ దెల్పినన్.

క. ఈనుడువు లిపుడ్డు వింటి వె
యానడుమన్ నీవు చిలుక నంపిననాఁడే

నానావిధముల నడిగిరి
మానవతీ, నీదు రాక మహి నల్పం బే.

వ. అనిన గోపాలచక్రవర్తికి రాధావధూతిలకంబతి ముదంబున నిట్లనియె.

సీ. పల్లెతావులనున్న గొల్లదానిని దెచ్చి
నవనిధానములందు నిలిపినావు
చెలఁగి రాధామాధవుల చెల్మి పాయక
బిరుదైన కీర్తిఁ గల్పించినావు
ప్రౌఢలైన కిరీటపతుల కన్నెలమాని
ననుఁ బ్రాణపదముగా నడపినావు
సకలవిద్యారహస్యము తెలుంగఁగ జేసి
దేహ మానంద మొందించినావు
నేఁడు నాపాలిదైవంబు నీవె యనినఁ
జాల దీమాట నామహోత్సాహమునకు
నెంతసంతోషపడెదనో యెఱుక లేదె?
మొదటి కిటుచేయు సర్వజ్ఞమూర్తివీవు.

గీ. ఒకటఁ గొఱఁతయు లేక నే నున్నదాన
నైన నావిన్నపం బిపు డాదరింపు

నీదుపట్టపుదేవుల నెనరుగలసి
బంతి భుజియింపవలె రేపు సంతసమున.

చ. అని మఱునాఁడు వారికిఁ బ్రి
యంబుగ సమ్మతిగాఁగ శౌరిచే
తనె పిలిపించి వారలును
దానును గృష్ణునిఁగూడి బంతులై
యనువుగఁ బంచభక్ష్య పర
మాన్నములన్ జవు లెంచికొంచు భో
జన మొనరించి ధౌతకర
సారసులై ముదమంది రందఱున్.

మ. నవరత్నస్థగితంపు సొమ్ములను నా
నాగంధపుష్పాదుల
న్నవరంగత్కనకాంబరంబులను గాం
త ల్వింతలై చేరి చు
ట్లు వసింపంగొలువున్న మాధవుని దం
డ న్నిల్చి యారాధ మ
క్కువతోఁ బల్కెను గప్పురంపు నును బ
ల్కుల్ దళ్కులం జిల్కఁగన్.

మ. పొలుపొ రుక్మిణి సత్యభామలకు నీ
పూఁబోండ్లకాయున్న క
న్నెలకు న్నేఁ జెలికత్తెనై తెలిపెదన్
వీరల్ భవత్ప్రీతికై
కలహంబందఁగ నేల? పంచి వరుసల్
గల్పించి గోపాల,వీ
రలరన్ దిట్టము నేన చేసెదను మ
ర్యాదన్ దగన్ నీయెడన్.

చ. ఒకనెల కొక్కమేర వినుఁ
డున్న దినంబులలోఁ బదాఱు వే
లకును బదాఱునాళు లవ
ల న్మరి యాఱుదినాలు నార్గు రొ
క్కొకటిని లక్షణాదులకు
నొప్పగు సత్యకు రెండునాళ్లు నం
దుకు నొకటెచ్చు రుక్మిణికిఁ
దోఁచినచో దయ నుందు వెల్తికిన్

గీ. అనుచు నోయక్కలార, నే నంటిననుచుఁ
గోప మించకుఁ డీమేర కొదువ గాదు

సమ్మతిలుఁడంచు సతుల మొగమ్ముఁజూచి
హరికి మొదలుగ రాధ యందఱకు మ్రొక్క.

క. కూర్చుండుమనుచు రాధన్
గూర్చి పడంతుకలు మెచ్చుకొంచును బ్రియమున్
గూర్చి పలుకంగఁ గృష్ణుఁడుఁ
గూర్చుండఁగ నిడియె నవ్వుకొనుచున్ జెంతన్.

ఉ. అంతట వారివారిని గృ
హంబులకున్ సెల విచ్చి రాధికా
కాంతను గృష్ణదేవుఁడు త
గం గరగించి చెలంగి వింతకున్
వింతలుగాఁ దమిన్ వరుస
వెంబడి నందఱియిండ్లకేగి య
త్యంత విలాసమార్గముల
దక్షిణనాయకుఁ డయ్యెనున్నతిన్.

క. విను రాధామాధవకృతి
మనమున నిడి వినినఁ జదివి మఱి వ్రాసిన మె
చ్చిన యాధన్యాత్ములకున్
వనజాక్షుం డొసఁగు సకలవైభవము దయన్.

గీ. అనుచు శుకయోగి దెల్పఁ సజ్జనకవిభుఁడు
కృష్ణదేవుఁడె మఱి దేవు లెఁకను గలరె?
దైవములటంచు వారల భావమునను
దలఁచి మ్రొక్కుచు శుకయోగిఁ గొలిచియుండె.

ఉ. కృష్ణయమంత్రిపుత్ర, సుక
వీంద్ర ముఖాంబుజకంజమిత్ర, శ్రీ
కృష్ణపదాబ్జసంతతవ
శీకృతచిత్త, నవీనచిత్తజా,
జిష్ణుసమానభోగ, గుణ
చిత్రవిశేష గభీరసాగరా,
వైష్ణవసమ్మతప్రకట
వస్తువిచారణ, మంత్రివారణా!

క. చతురతరవచన రచనా
చతురానన, కవినిధాన, సంతతదానా!
మితభాషణ హితపోషణ
మతితోషణ గుణధురీణ మాన్యవిహారణా!

మాలినీవృత్తము—
మగదలకులధీరా, మానినీచిత్తచోరా!
అగణితగుణహారా, యగ్గిరాధాకుమారా!

నిగమవిధివిహారా, నిత్యసౌఖ్యానుసారా!
నగరభవగభీరా, చారుశృంగారవీరా!

గద్య. ఇది శ్రీమద్వేణుగోపాల వరప్రసాదలబ్ధ
శృంగార కవిత్వ వైభవ వెలిదిండ్ల తిరు
వేంగళార్యతనూభవ విద్వజ్జనవిధేయ
వేంకటపతినామధేయ ప్రణీతంబైన
రాధామాధవ సంవాదం బను
మహాప్రబంధంబునందు
సర్వంబును
తృతీయాశ్వాసము.

---



రాధామాధవ సంవాదము
సంపూర్ణము

---